# మామయ్య

తెలుగు బాలల మాసపత్రిక

సంపుటి: 2 సంచిక: 2, హైదరాబాద్, ఫిబ్రవరి 2008
పేజీలు: 52 వెల: రూ. 10/-



అరిబండి బాలసాహిత్యం ట్రస్టు

PRSVMO2A 107









సంపుటి : 2 ఫిబ్రవరి - 2008 సంచిక : 2





**చిరునామా**

ఎడిటర్, **మామయ్య** బాలల మాసపత్రిక,
ఇం.నెం. 1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్: 040-27620887, ఫ్యాక్స్: 040-27620887
సెల్ : 94900 98903
mamayya_bs@yahoo.co.in,
**Website:** www.balasahityam.org



సంపాదకీయం

# చదువులు-పరీక్షలు

విద్యార్థినీ విద్యార్థులలో పరీక్షలు దగ్గరకొస్తున్నాయంటే కొంత ఒత్తిడి మొదలవుతుంది. దానికి తోడు ఉపాధ్యాయుల, తల్లితండ్రుల చేసే ఒత్తిడి కూడా ఉంటుంది. బాగా చదవమని, ఎక్కువ సమయము చదువుకోవాలని, ఆటలు, పాటలు కట్టిపెట్టాలని ఇలా రకరకాల ఆంక్షలు పెట్టడం చాలా సాధారణం. అసలు పరీక్షలు వస్తున్నాయంటే ఆందోళనకు, ఒత్తిళ్ళకు గురవుతున్నారంటే అది సరైనదేనా. ఎందుకు ఒత్తిడికి గురవ్వాలి. అది కేవలం విద్యార్థినీ విద్యార్థుల లోపమేనా? లేక ఉపాధ్యాయుల, తల్లితండ్రుల లేదా అసలు మన విద్యావిధానంలో ఏమైనా లోపముందా? అని ఆలోచించినప్పుడు అనేక విషయాలు చర్చకు వస్తాయి. అవన్నీ ఇక్కడ మనం ప్రస్తావించలేము. అయితే వాస్తవానికి విధానం ఏదైనా ఎటువంటి విద్యార్థినీ విద్యార్థులను తయారుచేయాలి? పరీక్షలంటే భయపడకుండా తమ ప్రతిభను వ్యక్తపరిచే ఒక అవకాశంగా భావించాలి కదా! మెజారిటీ విద్యార్థినీ విద్యార్థులు ఎందుకు అలా భావించే పరిస్థితి లేదు? అంటే మన బోధనా పద్ధతులు, విధానాలు దానికి కారణం. చదువుకు విషయజ్ఞానం కాకుండా మార్కులు కొలబద్దగా మారినప్పుడు ఈ పరిస్థితి ఏర్పడుతుంది. పాఠాలు అర్థం కాకపోయినా పరీక్షల్లో మార్కుల కోసం వాటిని వల్లెవేసే విద్యార్థినీ విద్యార్థులే నేడు అధికం. అసలు పాఠ్యాంశాలు ఎందుకు నిర్దేశిస్తారు. ఎలా నిర్దేశిస్తారు అనే అవగాహన గురించి ఉపాధ్యాయల దగ్గర నుండి తల్లితండ్రుల వరకు ఎవరూ పెద్దగా పట్టించుకునే పరిస్థితి లేదు. ఏ వయసు పిల్లలు ఏ విషయాలను తెలుసుకోగలరో. ఆ విషయాలను అత్యంత సృజనాత్మకంగా వారికి అర్థం చేయించడానికి ఎలాంటి పద్ధతుల్లో ప్రయత్నించాలి. అది నేడు అందని ద్రాక్ష. అందుకు తోడు ఏ భాషలో బాలలకు చదువు చెప్పించాలి అనే విషయంలో కూడా ఒక శాస్త్రీయ అవగాహన లేదు. మార్కెట్ ప్రపంచీకరణ ప్రభావంలో ఇంగ్లీషుకు డిమాండ్ ఉంది కాబట్టి వ్యవస్థ లో మొత్తం ఇంగ్లీషునే రుద్దే పరిస్థితి ఉంది. వేగవంతమైన ప్రపంచంలో సరైన విధానాన్ని చేపట్టే తీరిక ఉన్న పరిస్థితి కనపడట్లేదు. దానివల్ల మానవ సంబంధాలు కూడా కృత్రిమ సంబంధాలుగా మారిపోయాయి. చదువు విజ్ఞానంతో పాటు మానవత్వాన్ని అందించాలి. అవే చదువుకు కొలబద్దలుగా ఉండాలి. కేవలం మార్కులు, సంపాదనకు అవకాశం ఉన్న చదువులతో సాగే విధానం కరుణ, ప్రేమ మానవత్వాలు గల జనసంపదను, అలాంటి సమాజాన్ని సృష్టించలేదు. అసమానతలు లేని అందరికీ సరైన చదువు అందుబాటులో ఉండే విధ్యా విధానం రూపొందే దిశగా కృషి జరుగుతుందని ఆశిద్ధాం.







# చిట్టి రాకుమారి

- క్రాంతి

చాలా సంవత్సరాల క్రితం విక్రమపురి అనే రాజ్యం ఉండేది. ఆ రాజ్యంలో చిట్టి అనే బుల్లి పాప ఉండేది. ఎర్రగా, బుర్రగా, చలాకీగా వుండే చిట్టి అంటే అందరికీ ఇష్టమే. హనుమంతుకైతే మరీ మరీ ఇష్టం. ఇంతకీ హనుమంతు ఎవరనుకుంటున్నారు? ఓ కోతిపిల్ల. చిట్టికి కూడా హనుమంతంటే చాలా ఇష్టం. ఎప్పుడూ హనుమంతును వెంట పెట్టుకొని తిరుగుతుంటుంది.

చిట్టి వుండే ఊరికి దగ్గర్లోనే రాజధాని నగరం ఉంది. అక్కడ వారం వారం సంత జరుగుతుంటుంది. తనకు కావాల్సిన వస్తువులు కొనుక్కోవడం కోసం చిట్టి హనుమంతుతో కలిసి అక్కడికెళ్లింది. తన దగ్గర వున్న కొద్దిపాటి సొమ్ముతో ఓ పూసల దండ కొనుక్కుంది. హనుమంతు కోసం ఒక చొక్కా కూడా కొంది. సంతలో కొనుక్కోవాల్సినవన్నీ కొనుక్కున్నాక ఇద్దరూ కలిసి నగర వీధుల్లో తిరగసాగారు. కాస్త దూరం వెళ్లేసరికి వాళ్లకు ఓ అందమైన ఉద్యానవనం కనిపించింది. ఉద్యానవనంలో రకరకాల దుస్తులు ధరించిన మనుషులు తిరుగుతున్నారు. చిన్నపిల్లలు జారుడుబల్ల, కోతికొమ్మచ్చిలాంటి ఆటలెన్నో ఆడుతున్నారు. అదంతా చూస్తూ చిట్టి మైమరచిపోయింది. చివరికి హనుమంతు సంగతి కూడా మర్చిపోయింది. ఎప్పటికోగానీ తనకు తన నేస్తం సంగతి గుర్తుకురాలేదు. గుర్తొచ్చాక



చూస్తే పక్కన హనుమంతులేడు.

"వీడు ఏ కోతిచేష్టలు చేస్తున్నాడో" అనుకుంటూ ఉద్యానవనమంతా వెతికింది. ఎక్కడా హనుమంతు జాడలేదు. చిట్టికి చాలా భయమేసింది. ఏడుపు కూడా వచ్చింది. కళ్ల నీళ్లు తుడుచుకుంటూ అలాగే ఉద్యానవనమంతా వెతికింది. చివరకు ఓ చెట్టు కింద హాయిగా గుర్రుపెడ్తూ కనిపించాడు హనుమంతు.

"వెధవా! ఇక్కడున్నావా? ఉండు నీ పని చెప్తా...." అనుకుంటూ దగ్గరకెళ్లి, చెవి దగ్గర నోరు పెట్టి పెద్దగా అరిచింది. హనుమంతుకు మెలకువరాలేదు సరికదా గురక కూడా ఆపలేదు.



"పాపం... అయ్యవారు ఊరంతా తిరిగేనరికి అలిసిపోయినట్లున్నారు? నిన్ను ఎలా లేపాలో నాకు తెలియదా?" అనుకుంటూ ఓ కుండ నిండా నీళ్లు తీసుకొచ్చి, హనుమంతు మీద గుమ్మరించింది.

ఊహూ.... అయినా హనుమంతు లేవలేదు. కనీసం కదలను కూడా కదల్లేదు. వాణ్ణి నిద్రలేపడానికి చిట్టి చాలా ప్రయత్నాలే చేసింది. కానీ అవేవీ అతణ్ణి నిద్ర లేపలేకపోయాయి. హనుమంతు పక్కనే కూర్చొని, చిట్టి ఏడుపు రాగమందుకుంది. తన ఏడుపు విని ఉద్యానవనంలో వున్న వాళ్లంతా అక్కడికొచ్చారు. చిట్టినడిగి విషయమేంటో తెలుసుకున్నారు.

"అరరే.... ఈ చెట్టు కాయలేమైనా తిన్నాడో ఏమో?! ఈ కాయలు చూడ్డానికి చాలా బావుంటాయి. కానీ విపరీతమైన నిద్రమత్తు తెప్పిస్తాయి. ఆ మత్తు వదలాలంటే రాజకుమారి రావాల్సిందే" సమస్యతోపాటు పరిష్కారాన్ని కూడా చెప్పాడు ఓ పెద్దమనిషి.

"రాజకుమారి? మన రాజుగారికి పిల్లలు లేరుగా. ఎలా మరి?'' అయోమయంగా అంది మరో పెద్దావిడ. ఆ మాటలు విని చిట్టి మరింత పెద్దగా ఏడవసాగింది.

"అయ్యో.... చిట్టి తల్లీ... అలా ఏడవకు. ఎవరైనా రాజకుమారి వచ్చి లేపితేనే నీ స్నేహితుడు నిద్రలేస్తాడు. నువ్వు రాజకుమారి అయితే నీ నేస్తాన్ని క్షణాల్లో నిద్రలేపవచ్చు" చెప్పాడు ఓ పెద్దాయన.

"అదెలా తాతయ్యా?! నేనేమీ రాజకుమారిని కాదు కదా" కన్నీళ్లు తుడుచుకుంటూ ఆశ్చర్యంగా అడిగింది చిట్టి.

''చూడు తల్లీ.... రాజుగారి ప్రకటన నువ్వు విన్నావో లేవో. అనితర సాధ్యమైన మూడు పనులు చేసిన అమ్మాయిని తన కూతురిగా అంగీకరించి, ఈ రాజ్యానికి రాకుమారిని చేస్తానని ఈ మధ్యనే మన రాజుగారు ప్రకటించారు. ఆ పనులు నువ్వు చేస్తే నువ్వే రాజకుమారివి. అప్పుడు నీ స్నేహితుణ్ణి వెంటనే నిద్రలేపవచ్చు" చెప్పాడు ఓ నడివయసు వ్యక్తి.

"అలాగా?! అయితే ఆ మూడు పనులు ఏంటి?" ఉత్సాహంగా అడిగింది చిట్టి.

"ఈ నగరానికి దూరంగా వున్న



కొండ గుహలో కెంపులు పొదిగిన ఉంగరం ఉంది. దాన్ని తీసుకురావాలి. ఇది మొదటి పని. ఇక రెండోది.... రాజధానికి ఉత్తరం వైపు నుండి వున్న దారిలో నాలుగు పెద్ద పెద్ద బండరాళ్లు అడ్డంగా ఉన్నాయి. వాటిని కదల్చడం ఎవరివల్లా కాలేదు. సంగీతంతో వాటిని మెప్పిస్తే ఆ బండరాళ్లు వాటంతట అవే పక్కకు తప్పుకుంటాయి. అంటే నువ్వు సంగీతంతో వాటిని మెప్పించాలన్నమాట" అంటూ ఆగాడు ఓ పెద్దాయన.

"మరి మూడో పని?" కుతూహలంగా అడిగింది చిట్టి.

"ఇది కాస్త కష్టమైన పనే. ఆకాశంలో వుండే చందమామను భూమి మీదకు తీసుకురావాలి. రాముడికి వాళ్ల నాన్న దశరధుడు చూపించినట్లుగా కాదు. నిజంగానే కిందకు తీసుకురావాలి. మరి తేగలవా?" అడిగాడు ఆ పెద్దయన.



"ప్రయత్నిస్తాను. నా హనుమంతు కోసం ఏ పనైనా చేస్తాను" పట్టుదలగా అంది చిట్టి.

"నీ కోరిక తప్పక నెరవేరాలని కోరుకుంటున్నాను. వెళ్లిరా తల్లీ...." అంటూ ఆశీర్వదించాడు ఆ పెద్దాయన. చిట్టి మరోసారి హనుమంతును కళ్లారా చూసుకొని ఊరి చివర వున్న కొండ గుహ దగ్గరకు బయల్దేరింది.

...

గుహ దగ్గరకు వెళ్లేసరికి సాయంత్రమయ్యింది. లోపల చాలా చీకటిగా కూడా ఉంది. కానీ చిట్టి భయపడలేదు. తన ఇష్ట దైవాన్ని మనసులో తలచుకొని లోపలికి అడుగుపెట్టింది. కాస్త దూరంలో ఓ గాజు పెట్టె కనిపించింది. అందులో కెంపులు పొదిగిన ఓ ఉంగరం మెరుస్తూ కనిపించింది. ఆ పెట్టెకు దగ్గర్లోనే ఓ పెద్ద పులి పడుకొని, నిద్రపోతోంది. చిట్టి దాన్ని గమనించలేదు. తన దృష్టంతా అద్దాల పెట్టెలోని ఉంగరం మీదే ఉంది. చిట్టి అడుగులో అడుగు వేసుకుంటూ పెట్టె దగ్గరకెళ్లింది. అందులోని ఉంగరాన్ని చేతిలోకి తీసుకుంది. ఇంతలోనే పెద్ద పులి నిద్రలేచింది. చిట్టిని కోపంగా చూస్తూ ఆమెవైపు ఉరికింది. పెద్ద పులిని చూసిన చిట్టి భయంతో బిగుసుకుపోయింది. వెంటనే తేరుకొని అక్కడి నుండి తప్పించుకోవడానికి బయటకు పరుగు తీయాలనుకుంది. చేతిలో వుంటే ఉంగరం ఎక్కడ జారిపోతుందోనని దాన్ని వేలికి పెట్టుకుంది. అంతే.... మరుక్షణంలో ఆ కొండ గుహ కాస్తా అందమైన రాజమందిరంలా మారిపోయింది. పెద్ద పులి అందమైన యువకుడిలా మారిపోయాడు.

అతను తనవైపు ఆశ్చర్యంగా చూస్తున్న చిట్టితో, "నేనొక వజ్రాల వ్యాపారిని. అహంకారంతో విర్రవీగుతూ ఓ ముని శాపానికి గురయ్యాను. ఇన్నాళ్లకు నీ మూలంగా నాకు శాపవిమోచనమైంది. నాకు శాపవిముక్తిని కలిగించిన నీకు ఇది నేనిచ్చే



చిన్న కానుక. ఇది నిన్ను రాకుమారిని చేయడానికి ఉపయోగపడుతుంది" అంటూ ఓ అందమైన పెట్టె అందించాడు. చిట్టి దానివైపు ఆశ్చర్యంగా చూడసాగింది.

మళ్లీ అతనే, "ఈ పెట్టె తెరిస్తే వీనులవిందైన సంగీతం వినిపిస్తుంది. ఆ ఇంపైన సంగీతానికి పశుపక్ష్యాదులే కాదు. రాళ్లు సైతం నాట్యం చేస్తాయి" అని చెప్పాడు.

చిట్టి అతనికి కృతజ్ఞతలు తెలిపి, తెల్లవారిన తర్వాత అక్కడి నుండి బయల్దేరింది.

. . .

ఈసారి రాజధానికి ఉత్తరదిశగా వున్న దారివైపు నడిచింది చిట్టి. తను ఆ రాళ్లున్న ప్రాంతానికి చేరుకుంది. దారికి అడ్డంగా నాలుగు బండరాళ్లు ఉన్నాయి.



'చతురస్రాకారంలో నిలువుగా వున్న ఈ బండరాళ్లను కదిలించడం మానవమాత్రు- లెవ్వరికీ సాధ్యం కాదు' అనుకుంది చిట్టి. అప్పుడే ఆమెకు రాత్రి వ్యాపారి తనకిచ్చిన పెట్టె సంగతి గుర్తుకొచ్చింది. వెంటనే పెట్టెను తెరిచింది. అంతే.... "లే....లే....లే.... లేవాలి.... దారికి అడ్డం తొలగాలి" అంటూ వీనుల విందైన పాట వినిపించసాగింది.

ఆ పాట మాధుర్యానికి చుట్టూ వున్న చెట్టూచేమలు ఉల్లాసంగా తలలు ఊపసాగాయి. మరికాసేపటికి నిద్రాణంగా వున్న బండరాళ్లలో కదలిక వచ్చింది. అవి కూడా హుషారుగా పాటందుకున్నాయి.

"లే....లే...లే...లే.... లేచాము. దారికి అడ్డం తొలగాము" అంటూ అవి కూడా పాట పాడుతూ దారికి అడ్డం తొలిగాయి. కాసేపటికి పాట పూర్తయ్యింది.

చిట్టి వాటి దగ్గరకెళ్లి, "మీకు నేనెంతో ఋణపడి ఉంటాను. అసలు నేనెందుకొచ్చానంటే...." అంటూ ఏదో చెప్పబోయింది.

"ఆగమ్మాయ్.... నువ్వు మాకేమీ చెప్పాల్సిన పనిలేదు. నీ సంగతంతా మాకు తెలుసు. నువ్వు అనుకున్నది నెరవేరుతుంది. మీ హనుమంతును నిద్రలేపే పనిలో మేమూ నీకు సాయం చేస్తాం. ఈ దువ్వెన తీసుకెళ్లు. ఇది నీకెంతో ఉపయోగపడుతుంది" అని చెప్పింది ఓ బండరాయి. చిట్టి ఆ దువ్వెనను తీసుకొని అక్కడి నుండి బయల్దేరింది.

. . .

చిట్టి నేరుగా రాజభవనానికి వెళ్లింది. "ఇక్కడే అసలు సిసలైన పని మిగిలిపోయింది. ఈ పని నా ఒక్కదాని వల్ల అయ్యేలా లేదు. నాకెవరైనా సాయం చేస్తే బావుణ్ణు" అని మనసులో అనుకుంది చిట్టి.

"చిట్టీ.... మేమంతా నీ కోసమే వచ్చాం. నీకు సాయం చేస్తాం" అంటూ కోట గోడ పక్కన దాక్కున్న చిట్టి స్నేహితులు బయటికొచ్చారు.

"ఇదేంటీ? మీరిక్కడికెలా వచ్చారు?!" ఆశ్చర్యంగా అడిగింది చిట్టి.

"నీ గురించి మన ఊళ్లో అందరికీ తెలిసింది. నీకెలాగైనా సాయం చేయాలని



మేమే వచ్చాం" చెప్పాడు కృష్ణ.

"సరే.... ముందు రాజభవనంలోకి వెళ్దాం పదండీ...." అంటూ ముందుకు దారితీసింది చిట్టి. ఆమె వెనకే మిగిలిన వాళ్లూ ముందుకు కదిలారు. అప్పుడు అక్కడికొచ్చిన రక్షక భటులు వాళ్లను ముందుకు వెళ్లనివ్వలేదు.

అసలు విషయం చెప్పిన తర్వాత చిట్టిని ఒక్కదాన్నే లోపలికి అనుమతించారు. మిగిలిన వాళ్లంతా విచారంగా కోట గుమ్మం దగ్గరే నిలబడిపోయారు.

చిట్టి కోటలో అడుగుపెట్టింది. చందమామను భూమి మీదకు ఎలా తీసుకురావాలో అర్థంకాలేదు. ఏదైనా ఉపాయం తట్టుందేమోనని తల గోక్కుంటూ ముందుకు వెళ్తోంది. అంతలోనే బండరాళ్లు ఇచ్చిన దువ్వెన గుర్తుకొచ్చింది.



"ఈ చింపిరి జుట్టుతో లోపలికెళ్తే రాజుగారు అడుక్కునే అమ్మాయి అనుకుంటారు. ముందు తల దువ్వుకొని తర్వాత రాజుగారి దగ్గరకెళ్దాం" అనుకుంటూ సంచిలో వున్న దువ్వెన బయటకు తీసి, దువ్వడం మొదలుపెట్టింది చిట్టి. ఆశ్చర్యం?! ఆమె దువ్విన ప్రతిసారీ జుట్టు మూరెడు పొడవున పెరుగుతోంది. ఇది కలో నిజమో చిట్టికి అర్థంకాలేదు. అప్పటికే ఆమె జుట్టు మూడు మీటర్ల పొడవు పెరిగింది. ఆశ్చర్యంతో చిట్టికి నోట మాట రాలేదు. అంతలోనే తేరుకొని కోట గుమ్మం దగ్గరకు పరుగుతీసింది.

స్నేహితుల్ని పిలుస్తూ, "చూడండీ.... నా జుట్టు ఎంత పొడవు పెరుగుతోందో చూడండీ...." అని కేకలేసింది. చిట్టి మాటలు వన విహారానికి బయటికొచ్చిన రాజుగారి దంపతుల చెవిన పడ్డాయి. వాళ్లు ఆమె దగ్గరకొచ్చారు.

"ఇదేంటీ... నీ జుట్టు ఇలా పెరిగిపోతోంది? కొంపదీసి ఆ చంద్రుణ్ణి ఈ జుట్టుతోగానీ లాగవు కదా" అని పరిహాసమాడాడు రాజు.

చిట్టికి వెంటనే ఓ ఉపాయం తట్టింది. తన స్నేహితులందర్నీ దగ్గరకు పిలిచి, చెవిలో ఏదో గుసగుసలాడింది. వాళ్లు ఉత్సాహంతో ఆమె చెప్పిన దానికి సరేనంటూ తలలూపారు. ఈసారి చిట్టి కోట గోడ మీదకు ఎక్కింది. అక్కడి నుండి దువ్వడం మొదలుపెట్టింది. అప్పటికే చీకటిపడ్తోంది. ఆకాశంలో నక్షత్రాలు, చందమామ కనిపిస్తున్నారు. కాసేపటికి చిట్టి జుట్టు నేలను తాకేంత పెద్దగా తయారయ్యింది. కింద వున్న ఆమె స్నేహితులు ఆ జుట్టుతో చంద్రుడి దగ్గరకు వంతెన ఏర్పాటుచేశారు. దాని మీదుగా నడుచుకుంటూ చిట్టి స్నేహితుడు కృష్ణ చంద్రుడి దగ్గరకెళ్లాడు.

తన దగ్గరకు నడిచొచ్చిన పిల్లవాణ్ణి చూసి, "ఏంటోయ్ కుర్రోడా? జుట్టుతో వంతెనేంటి? నువ్వు నడుచుకుంటూ నా దగ్గరకు రావడమేంటి? అంతా వింతగా ఉందే?!" అని ఆశ్చర్యపోతూ అన్నాడు.



"మీతో మాకు పని పడిందండీ...." అంటూ మొదలుపెట్టి మొదటి నుండి జరిగిందంతా చంద్రుడికి చెప్పాడు కృష్ణ. అంతా విన్న తర్వాత చంద్రుడు ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకున్నాడు.

"ఆ రాజు కోసం కాకున్నా నీ స్నేహితురాల్ని చూడ్డానికైనా కిందకు రావాలని ఉందోయ్. పద వస్తున్నాను" అంటూ కృష్ణ వెనకే కిందకు దిగొచ్చాడు చంద్రుడు.

నేల మీదకు దిగొచ్చిన నెలవంకను చూసి, నగరవాసులంతా ఆశ్చర్యపోయారు. అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన చిట్టిని తమ కుమార్తెగా అంగీకరిస్తున్నట్లు రాజు ప్రకటించాడు. ఆ మరుక్షణమే చిట్టి ఒంటి మీద వున్న పాత బట్టల స్థానంలో బంగారు రంగులో మెరుస్తున్న మేలిమి వస్త్రాలు ప్రత్యక్షమయ్యాయి. తల మీద కిరీటంతో వెలిగిపోతున్న చిట్టిని చూసి, అక్కడ వున్న వారంతా హర్షధ్వానాలు చేశారు.

కాసేపయ్యాక రాజుగారిని తీసుకొని ఉద్యానవనానికి వచ్చింది చిట్టి. అమాయకంగా నిద్రపోతున్న హనుమంతును చేతుల్లోకి తీసుకొని గట్టిగా కౌగిలించుకుంది.

"హనుమంతూ.... నిజమైన రాకుమారిని వచ్చాను. ఇకనైనా నిద్రలే...." అంటూ తన ఉంగరం వున్న చేతితో నుతారంగా నిమిరింది. అప్పుడే నిద్రలేస్తున్నట్లుగా లేచి కూర్చున్నాడు హనుమంతు. చిట్టి హనుమంతును తీసుకొని, రాజుగారి కోటకు బయల్దేరింది ఆనందంగా.



# నేనెవరిని?

నాముఖం నిండ బోలెడన్నిమచ్చలు
అయినా అందరు నాముఖాన్నే చూస్తారు
నాముఖాన్ని చూడగానే కొందరికి
చమటలు పుట్టుకు వస్తాయి
ఉరుకులు పరుగులు పెడతారు
కొందరు ఉన్నచోటు నుండి కదలనే కదలరు
అలుపూ సలుపూ ఎరుగను నేను
అనునిత్యం కర్తవ్య నిర్వహనే నా పని
కారు, రైలు, ఓడ, విమానం,
ఏ యంత్రమైన నా ఆజ్ఞ ప్రకారం నడవాల్సిందే
ఆజ్ఞను మీరితే అన్నీ అఘాయిత్యాలే
కుంటి చేతుల వాడిని నేను
అయినా కర్తవ్య లోపం రానివ్వను నేను
నా యజమాని నా చెవులు మెలేసిమరీ
నాచేత పని చేయించుకుంటూ వుంటాడు
శ్రమ జీవికి ఎక్కడైనా సెలవులుంటాయి
నాకు మాత్రం సెలవే యివ్వడు నాయజమాని
బండ చాకిరికి మారుపేరు నేను
నేనెవరిని?

**- పెరుగు నాసరయ్య**

## ఆపిల్ తింటే...

**(గేయం)**

**రోజూ ఒక ఆపిల్ తింటే**
**డాక్టర్ అవసరమే రాదు**
**ఆడిపాడినా, గెంతినా,**
**అమ్మ కాదనదు.**

**- కె. విజయభాను**





# ఐకమత్యమే మహాబలం

హాయ్ బాలలూ

"ఐక్యమత్యం" అంటే ఏమిటో తెలుసా! ఇది మంత్రమో, ఇంద్రజాలమో, గారడియో కాదు "ఐక్యమత్యం" అంటే అందరు కలిసి సమిష్టిగా ఆలోచించి ఒకే మాట మీద వుండటమన్న మాట. ఒకే ఇంట్లో వుంటూ కలిసికట్టుగా పెరిగే అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు అందరూ కలిసి ఆడుకుంటారు కదా! బయటి స్నేహితులతో కలిసి ఆడుకొనేటప్పుడు బయటవారు మీ అక్కతో గాని, తమ్ముళ్ళతో గాని, చెల్లెలుతోగాని తగాదా పెట్టుకొన్నప్పుడు లేదా కొట్టినప్పుడు మీరంత ఒకటై ఎదుటి వారిని ఎదిరిస్తారు కదా! ఐక్యమత్యమంటే ఇదే. అంతదాక ఎందుకు? అమ్మ, నాన్నలు తమ్ముడు ఏదైన తప్పు చేసినపుడు కోప్పడితే స్కూలుకు వెళ్ళనని పేచీ పెట్టి ఏడుస్తుంటే మీరు తమ్ముడి జట్టే చేరతారు కదా! ఇది మీరు మీ తమ్ముడితో ఐక్యంగా ఉన్నట్లు అర్థం చేసుకోవాలి. ఐక్యమత్యం వల్ల జరిగే లాభాన్ని అర్థం చేసుకోవడానికి ఈ కథ మీరు వినాలి.

" ఒక ఊరిలోని ఒక ఇంట్లో తల్లి, తండ్రి, నలుగురు కొడుకులు ఉండేవారు. తల్లిదండ్రులు పిల్లలను పెంచి పెద్ద చేసి చదువు చెప్పించారు. అందరూ పట్టణాలకు వెళ్ళి ఉద్యోగాలు చేస్తూ వేరు వేరుగా ఉంటున్నారు. అప్పుడప్పుడు, పండుగలకు, ఇతర సెలవులకు వచ్చి తల్లిదండ్రులను చూసి వెళ్ళిపోయేవారు. కొంత కాలానికి తల్లిదండ్రులు పెద్ద వారై ముసలి వారిగా మారారు. తండ్రికి జబ్బు చేసింది. కబురు అందగానే నలుగురు కొడుకులు భార్యా పిల్లలతో తండ్రిని చూడడానికి వచ్చారు. క్షేమ సమాచారాలు విచారించిన తర్వాత పిల్లల మధ్య కావలసినంత ఆప్యాయత, ప్రేమ అనురాగాలు లేవని తండ్రి తెలుసుకున్నాడు.



పిల్లలు పెద్ద వాళ్లైన తర్వాత మాటలతో చెబితే వినరు కదా? అందుకు తండ్రి ఏం చేశాడో తెలుసా!



పాలేరును పిలిపించి ఒక కర్రల మోపును తెప్పించారు. ఆ మోపును తన ఒక్కొక్క కొడుకుకు ఇచ్చి ఇరవమన్నారు. ఏ ఒక్క కొడుకూ కర్రల మోపును ఇరవలేక పోయాడు. ఆ తర్వాత తండ్రి పాలేరుచే మోపును విప్పించి ఒకొక్క కర్రను అందరి కొడుకులకు ఇప్పించి, వేరు వేరుగా ఇరవమన్నాడు. అప్పుడు అందరూ తమకు ఇచ్చిన కర్రలను తేలిగ్గా విరిచారు. అప్పుడు తండ్రి చెప్పకుండానే కొడుకులు ఐక్యమత్యంగా, కలసి మెలసి వుంటే ఎటువంటి లాభము కలుగుతుందో గ్రహించారు. వేరు వేరుగా, ఒంటరిగా వుంటే కలిగే నష్టాన్ని కూడా అర్థం చేసుకున్నారు. సిగ్గుతో తలవంచుకొని తాము ఐక్యమత్యంగా ఉండి, సుఖ సంతోషాలను పంచుకొని సంతోషంగా వుంటామని తండ్రికి వాగ్దానం చేశారు."

బాలలూ! ఇప్పుడు మీరు చూశారు కదా! ఐక్యమత్యంగా ఉండకుండా వేరు వేరుగా ఉంటే కలిగే నష్టాన్ని? అందువల్ల మీరు భావి భారత పౌరులుగా కులమత భేదాలు మరిచి, ఐక్యమత్యంగా ఉండి దేశాభివృద్ధికి తోడ్పడుతూ మీరు కూడా అభివృద్ధి చెందుతారు కదూ? అవసరమైనప్పుడు ఒకరికొకరు సహాయ పడుతారు కదూ? ఇలాగే అవసర మున్నప్పుడు ఇతరుల సహాయాన్ని తీసుకోవడానికి సంకోచించ కూడదు. మీరు కూడా ఇతరులు మీ సహాయాన్ని కోరినప్పుడు మీ శక్తి మేర సహాయం చేయాలి. ఇదే మన ధర్మం.

ఇట్లు
మీ బామ్మ
సత్య ప్రసూన



## దిక్కులు

దిక్కు దిక్కు
ఏమి దిక్కు
తూర్పు దిక్కు
తూర్పున వున్నది బంగాళాఖాతం
దిక్కు దిక్కు
ఏమి దిక్కు
పడమర దిక్కు
పడమర వున్నది అరేబియా సముద్రం
దిక్కు దిక్కు
ఏమి దిక్కు
ఉత్తరం దిక్కు
ఉత్తరాన ఉన్నవి హిమాలయాలు
దిక్కు దిక్కు
ఏమి దిక్కు
దక్షిణం దిక్కు
దక్షిణాన వున్నది హిందూ మహాసముద్రం

**- మేరెడ్డి యాదగిరిరెడ్డి**

# శ్రమ: 3. రకాలు

## మానవ పరిణామ క్రమంలో శ్రమ పాత్ర



మానవుడు భూగోళం మీద కనిపించే మిగతా జీవరాసుల కన్న అత్యంత తెలివైన వాడు. తన తెలివి, నైపుణ్యంతో తన కన్న ఎన్నో రెట్లు బలమైన, భయంకరమైన ఏనుగు, సింహం, పులి లాంటి జంతువులపై అదుపును సాధించాడు. వీనిని కూడా తను అనుకున్నట్టుగానే వాడుకుంటున్నారు. లేదా నియంత్రిస్తున్నారు. చివరకు ప్రకృతిని కూడా ఎదిరిస్తూ, అనువు కాని పరిస్థితులను అనుకూలంగా మార్చు కుంటున్నాడు. ఈ ప్రయత్నం ఇంకా కొనసాగుతుంది. ఎండ, చలి, వాన, వరదలు, గాలిదుమ్ములు, పర్వతాలు, భూకంపాలు, ఊరుములు, మెరుపులు, పిడుగుల రూపంలో ప్రకృతి అననుకూల పరిస్థితులు మనం చూస్తున్నాం. ఇలాంటి కష్టాలను కూడా తట్టుకొని అభివృద్ధి పొందడానికి మానవుడు తన తెలివి, శ్రమతో పని చేస్తాడు. దీనికి అవసరమైన సాంకేతిక విజ్ఞానాన్ని కూడా సమకూర్చుకున్నాడు. వీటి అన్నిటిలో మానవ శ్రమే కీలక పాత్ర వహించింది.

అయితే, నేడు మనం చూస్తున్న మానవుడు ప్రస్తుత స్థాయికి ఒకేసారి రాలేదు. క్రమక్రమంగా తన శ్రమ సామర్థ్యాన్ని పెంచుకునేందుకు అవసరమైన విజ్ఞానాన్ని, పని ముట్లను, యంత్రాలను తయారు చేసుకొని ఇప్పటి స్థాయికి చేరాడు. కొన్ని లక్షల సంవత్సరాల క్రితం నుండి మానవుడు భూగోళం మీద నివసిస్తున్నట్లు ఆధారాలు ఉన్నాయి. ఈ మధ్య కాలంలో మానవుడు భౌతికంగా, మానసికంగా ఎంతో పెరిగి, తన పరిసరాలను తనకు అనుకూలంగా మార్చుకున్నాడు. కొన్ని విషయాలలో ప్రకృతి శక్తులపై విజయం సాధించినప్పటికీ, ఎన్నో విషయాలలో ఇంకా ఆధిపత్యం సాధించ లేదు. ఉదాహరణకు ఎండ, వాన, గాలిదుమ్ముల నుండి రక్షించుకోవడానికి



మంచి ఇళ్ళను నిర్మించుకున్నారు. తీవ్ర ఎండల నుండి కాపాడుకోవడానికి చేతితో పని చేసే విసనకర్రలను, తరువాత ఫ్యాన్లను, చివరికి కూలర్లు, ఎయిర్ కండిషనర్లను రూపొందించుకున్నాడు. ఇలాగే, చలి నుండి రక్షించుకోవటానికి ఇళ్ళను వేడి చేసే హీటర్లను ఏర్పాటు చేసుకున్నాడు. దూరాల్ని తగ్గించుకోవడానికి రవాణా సౌకర్యాలను బండ్లు, స్కూటర్లు, కార్లు, బస్సులు, ఓడలు, విమానాల రూపంలో ఏర్పాటు చేసుకున్నాడు. వీటన్నిటిలో శ్రమ ఇమిడి ఉన్నది. శ్రమ చేయకుండా ఇవేవి సాధ్యం కావు.

**మానవుడి పరిణామ క్రమంలో శ్రమ**

కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం భూగోళం మీద అసలు మానవుడే లేడని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. నేటి మానవుడు వానరుడి నుండి, అంటే కోతి నుండి, మార్పు చెంది రూపొందాడట. దీనికి చారిత్రక ఆధారాలు కూడా చూపెడుతున్నారు. నేడు మనం జంతు ప్రదర్శనశాలల్లో చూస్తున్న చింపాంజీలు మానవుడితో ఎన్నో పోలికలు కలిగి ఉన్నాయి. చింపాంజీలు నాలుగు కాళ్ళతో నడుస్తున్నా, అవసరమైతే వెనక రెండు కాళ్ళపైనే నడుస్తూ, ముందు రెండు కాళ్ళను చేతులుగా కూడా ఉపయోగిస్తున్నాయి. కోతులు నాలుగు కాళ్ళతో నడుస్తున్నాయి. కాని మానవులు రెండు కాళ్ళ తోనే నడుస్తారు. కోతుల ముందు రెండు కాళ్ళు మానవుని చేతులుగా పరిణామం చెందాయి. ఈ మార్పు వల్ల మానవునికి శ్రమ చేయడం తేలికగా మారింది. ఈ పరిణామంలో శ్రమ అతి కీలకమైన పాత్ర వహించింది.

అడవిలో ఉంటూ వేగంగా, సమర్థవంతంగా చెట్లు ఎక్కడం, ఆహారం సేకరించడం లాంటి అన్ని ప్రక్రియల్లో మానవుని చేతులు కోతుల కాళ్ళ కన్న ఎన్నో రెట్లు సమర్థవంతంగా పని చేస్తున్నాయి. అంటే, మానవునికి చేతులు ఏర్పడడానికి శ్రమ సామర్థ్యం కీలక పాత్ర వహించింది. మానవుడు తన పరిసరాలు, ప్రకృతితో గల సంబంధాలను కొనసాగించే ప్రక్రియలో ఎన్నో కొత్త కొత్త అనుభవాలను సంపాదించు కున్నాడు. మానవులు తమ అనుభవాలను, ఉద్దేశ్యాలను పరస్పరం తెలుపుకోవడానికి మొదట సంకేతాలు, ఆ తరువాత శబ్దాలతో కూడిన భాషను కూడా ఏర్పరుచుకున్నారు. వీటన్నిటి ఫలితంగా మానవుడి మేధస్సు, అంటే బుర్ర, బాగా అభివృద్ధి చెందింది. అందువల్ల జ్ఞాపక శక్తి కూడా బాగా పెరిగింది. ఇలా ఏ ఇతర జంతువులలో మేధస్సు అభివృద్ధి చెందలేదు. మానవులలో ఈ పరిణామాలన్నిటికీ మూలం శ్రమే.

చేతులను ఉపయోగించి మానవుడు ఎన్నో రకాల పనిముట్లను, యంత్రాలను తయారు చేశాడు. ఇవేవి శ్రమ లేకుండా సాధ్యం కావు. పైగా ఇవన్నీ మానవుని శ్రమ సామర్థ్యాన్ని పెంచేవే.

ఒక్క మాటల్లో చెప్పాలంటే వానరుడి నుండి మానవునిగా జరిగిన పరిణామ క్రమానికి, మానవ అభివృద్ధికి మానవుని శ్రమే కీలకం. మానవుడు తన శ్రమ భారాన్ని తగ్గించి, నైపుణ్యాన్ని పెంచుకోవడానికి పశువుల శ్రమ, యాంత్రిక శ్రమను తనకు అనుకూలంగా రూపొందించింది మానవ శ్రమే.

అందువల్ల చూశారా బాలలూ!! మానవ శ్రమ ఏ రూపంలో ఉన్నప్పటికీ విలువిచ్చి, గౌరవించడం నేర్చుకోవాలి.

# తిమ్మప్ప తమాషాలు!! 2



## ఏనుగు అరుపు- అందరి పరుగు

- శాఖమూరి శ్రీనివాస్

'శ్రీపురం' అనే నగరానికి 'బొంబాయి సర్కస్' వచ్చి రెండ్రోజులైంది. చుట్టు పక్కల గ్రామాల వాళ్ళు తండోప తండాలుగా వెళ్ళి చూసి వస్తున్నారు. అక్కడ ఉన్న జంతువులు, సర్కస్ వాళ్ళు చేసే విన్యాసాలు, ధ్వన్యనుకరణ (మిమిక్రీ) అందర్నీ బాగా ఆనందపరుస్తున్నాయి.

ఒక ఉదయం... తిమ్మప్ప గొడ్ల చావిడిలో పని చేస్తున్నాడు. " ఏరా.... ఎప్పుడూ ఈ గేదెలు, ఆవుల్ని చూడడమేనా! వేరే జంతువుల్ని చూడాలన్న ఆసక్తి లేదా?" మిత్రుడు రామప్ప మాటలు విని వెనక్కి తిరిగాడు తిమ్మప్ప.

" మనకు చూడాలని ఉన్నా అన్నీ ఒకే చోట ఎలా ఉంటాయి?" అనుమానం వెలిబుచ్చాడు తిమ్మప్ప.

" అందుకేరా.... నీది మట్టి బుర్ర అనేది! రెండ్రోజుల నుంచీ మన ఊరి వాళ్ళందరూ కట్టగట్టుకుని 'శ్రీపురం' నగరానికి ఎందుకు వెళుతున్నారో తెలుసా?" అంటూ సర్కస్ వివరాలన్నీ చెప్పాడు రామప్ప.

చెప్పడమేకాదు... మరుసటి రోజు



ఇద్దరమూ కలిసి వెళదామని తిమ్మప్పను ఒప్పించాడు.

అనుకున్నట్లుగానే ఇద్దరూ సర్కస్‌కు వెళ్ళారు. అక్కడి హడావుడి చూసి కాస్త బిత్తరపోయాడు తిమ్మప్ప. రంగు రంగుల డేరాలు, చీమల బారుల్లా ఉన్న జనాలు, బోనుల్లో బందీలుగా ఉన్న జంతువులు, తినుబండరాల అంగళ్ళు... అంతా కొత్తగా ఉంది.

ఇద్దరూ టిక్కెట్లు తీసుకొని లోపలికి అడుగు పెట్టారు. లోపల కుర్చీలనిండా జనాలున్నారు. ప్రదర్శన మొదలైంది. ఏనుగులు, పులులు, సింహాలు, కోతులు... ఎన్నో జంతువులు రకరకాల విన్యాసాలు చేశాయి. ఆ తరువాత రంగు రంగుల బట్టలేసుకున్న అమ్మాయిలు, అబ్బాయిలు వాళ్ళతో ఉయ్యాలలూగడం, పై నుంచి క్రింద ఉన్న వలపైకి దుముకడం... అలా ఎన్నో చేశారు. చివరగా ఓ కళాకారుడు వివిధ జంతువుల అరుపులు, పక్షుల శబ్దాలు, మనుషుల గొంతుల్ని అనుకరించాడు.



ప్రదర్శన పూర్తయ్యింది. దారివెంట నడుస్తున్నా... తిమ్మప్ప మనసులోంచి సర్కస్ చెరిగిపోలేదు. ముఖ్యంగా మిమిక్రీ! తనకు అదెంతో నచ్చింది. తనను వెంట బెట్టుకుని సర్కస్ చూపించినందుకు రామప్పకు కృతజ్ఞతలు చెప్పాడు.

* * *

ఒక రోజు చెరకు తోటను చూసేందుకు వెళ్ళాడు భూషయ్య. తోటలో అడుగుపెట్టి గడలను పరిశీలిస్తుండగానే... అతి దగ్గరలో ఏనుగు ఘీంకారం వినబడింది. భూషయ్య హడలిపోయాడు. తోట పక్కన అడవి కావడంతో ఏనుగులు వచ్చేందుకు అవకాశముంది. అయితే చాలా సంవత్సరాల నుంచి అవి అడవిని వదలి రావడంలేదు. మళ్ళీ ఈ రోజు ఏనుగు ఘీంకారం! పరుగెత్తి గట్టున ఉన్న వేప చెట్టు ఎక్కి, శబ్దం వినబడిన వైపు చూశాడు.

అక్కడ ఏ ఏనుగూ కనబడలేదు. మరి కాసేపటికే మళ్ళీ ఘీంకారం! ఏపుగా పెరిగిన చెరకు గడల మధ్య ఎక్కడో ఏనుగులు ఉన్నాయనుకున్నాడు. తోటలోపలికెళ్ళి చూడడానికి ధైర్యం చాలలేదు. కాపలా ఉంచిన తిమ్మప్ప కూడా కనిపించలేదు.

వడి వడిగా చెట్టు దిగి ఊరివైపు పరుగెత్తాడు భూషయ్య. ఓ పది మందిని తీసుకొచ్చి, డప్పులు వాయించి ఏనుగుల్ని తరిమెయ్యాలనేది అతని ఆలోచన! వచ్చిన వాళ్ళంతా కలిసి జట్టుగా డప్పులు వాయిస్తూ తోటంతా తిరిగాడు. ఎక్కడా ఏనుగులు కాదు కదా.... అవి తిని పడేసిన చెరకు పిప్పి కూడా కనిపించలేదు. ఒక చోట మాత్రం చెరకు గడ తింటూ తిమ్మప్ప కనిపించాడు. వచ్చిన వాళ్ళు అతణ్ణి ఏనుగుల గురించి అడిగారు.

తిమ్మప్ప పకపకా నవ్వుతూ, "ఏనుగా... ఇప్పుడే వస్తుంది!" అంటూ నోట్లో వేళ్ళు ఉంచుకుని ఏనుగు ఘీంకారాన్ని వినిపించాడు. అచ్చు నిజం ఏనుగు చేసిన శబ్దం లాగానే ఉందది!

" నీ వేషాలతో అందర్నీ ఇబ్బంది పెడతావా?" అంటూ తిమ్మప్పను భూషయ్య దగ్గరకు తీసుకొచ్చారు వాళ్ళు. జరిగిందంతా వాళ్ళు చెప్పేసరికి, భూషయ్య తిమ్మప్పను





చెడామడా తిట్టి, "ఇంకెప్పుడైనా నాకిలాంటి శబ్దాలు వినబడితే నిన్ను కట్టుగట్టి అడవిలో పడేస్తాను. అక్కడ జంతువులతో కలిసి ఉందువు గాని..." అంటూ తీవ్రంగా హెచ్చరించి వెళ్ళాడు.

తిమ్మప్పకేమీ అర్థం కాలేదు. అయినా తన కళను మరవకూడదను కున్నాడు. అందుకని... పగలు ఎలాంటి సాధనా చేయకుండ, రాత్రిళ్ళు జంతువుల అరుపులను అనుకరించసాగాడు. రాత్రి ఎలాగూ భూషయ్య రాడన్న ధైర్యంతో!

ఒకరోజు... చెరకు గడల్ని చప్పరించేందుకు అడవి పందుల గుంపొకటి బయలుదేరింది. అవి తోట దగ్గరికి రాగానే ఏనుగుల ఘీంకారాలు, ఎలుగుబంటి అరుపులు, పులి గాండ్రింపులు... ఒకదాని వెనక మరొకటి వినిపించాయి.

ఇంకేముంది?! బ్రతికుంటే బలుసాకు తినొచ్చని పందుల మంద మొత్తం తిరుగు ప్రయాణం కట్టింది.

అలా అవి రోజూ తోట దగ్గరికి రావడం, తిరిగి వెళ్ళడం జరుగుతోంది. తిమ్మప్ప తన సాధన ఆపలేదు కదా మరి! చెరుకు తోట మాత్రం చెక్కు చెదరకుండా ఉంది. 

# చందమామ

అందాల మామ
చందమామ
అందరికీ మామ
చందమామ
నింగిలో వెలసిన
నీలాకాశంలో
అందాల నెలవంక
వెన్నెల జాబిల్లి
చుక్కల్లో రారాజు
అందాల చందమామ
చక్కని చందమామ
చిక్కని చందమామ
చందమామ రూపం రమణీయం
చందమామ బింబం కమనీయం

- లక్కరాజు ప్రపుల్లచంద్ర

## ఒకసారి ఆలోచించండి

1. కాయ గాని కాయ - గడుగ్గాయ
2. నీరు గాని నీరు - కన్నీరు
3. రాళ్ళు గాని రాళ్ళు - ఉండ్రాళ్ళు
4. రాయి గాని రాయి - తురాయి
5. పాలు గాని పాలు - మురిపాలు
6. ఆట గాని ఆట - పోట్లాట
7. కారం గాని కారం - అహంకారం
8. కర్ర గాని కర్ర - జీలకర్ర



# మానవ అభివృద్ధిలో మైలురాళ్ళు - 4. లోహాల వాడకం

- వికాస్



వ్యవసాయం అభివృద్ధి చెందే సమయంలోనే లోహాల వాడకం ప్రారంభమైంది. ఇనుము, స్టీలు, రాగి, అల్యూమినియం లాంటి పదార్థాలను లోహాలు అని పిలుస్తాం.

మన ఇంట్లో వాడుకునే పాత్రలు సామాన్యంగా స్టీలు, అల్యూమినియం, ఇత్తడి, రాగి లేదా కొన్ని లోహాలు కలిసిన మిశ్రమాలతో చేసిన పాత్రలనే వాడుతున్నాం. ఇలాగే ఫ్యాన్లు , స్కూటర్లు, కార్లు, రైళ్ళు, విమానాలు, ఇతర ఇంజన్‌లు అన్నీ ఏదో ఒక లోహం లేదా వాని మిశ్రమాలతో తయారు చేసినవే. అందువల్ల లోహాల వాడకం లేని ఆధునిక మానవ జీవితం ఊహాలోకంలోనైనా సాధ్యం కాదు. అందువల్ల లోహాల వాడక ప్రారంభం మానవ జాతి అభివృద్ధి క్రమంలో ఒక మైలు రాయిగా నిలిచింది.

ఇప్పటి ఇరాన్, ఇరాక్ దేశాలలో క్రీస్తు పూర్వం 3500 ప్రాంతంలో రాగి, టిన్ లు కలిసిన మిశ్రమ లోహం, 'కాంస్యం' వాడకం ప్రారంభమైంది. ఇంతకు ముందే క్రీస్తు పూర్వం 5 వేల ప్రాంతంలో ఇప్పటి థాయిలాండ్ దేశంలో కాంస్య వాడకం ప్రారంభమైందని కొంత మంది చెబుతున్నారు. అయితే, ఇప్పటి టర్కీ దేశం 'అనటోలియా' అనే ప్రాంతంలో కాంస్యాన్ని పెద్ద ఎత్తున తయారు చేసేవారట. ఈ ప్రాంతంలో రాగి, టిన్‌లు అధికంగా కలిగిన ఖనిజ సంపద భూమి పైనే ఉండేదట.



అందువల్ల వీనిని కరిగించి, కాంస్యాన్ని తేలికగా తయారు చేసేవారు. ఇతర ప్రాంతాలకు ఎగుమతి కూడా చేసేవారు. కాంస్యం వాడకంవల్ల పట్టణ ప్రాంతాలు వెలసి, విస్తరించాయి. మన దేశంలో కాంస్య వాడకం క్రీస్తు పూర్వం 3300 ప్రాంతంలో ప్రారంభమైందట. కాంస్యంతో చిన్న చిన్న పని ముట్లు, యుద్ధానికి పనికొచ్చే ఆయుధాలు, వివిధ పాత్రలు, నగిషీతో కూడిన అందమైన వస్తువులు తయారు చేసేవారట. కాని ఇవి గట్టిగా ఉండేవి కావు. తొందరగా మొద్దు బారేవి. తిరిగి కొచ్చెగా, పనికి వచ్చేలా చేయడానికి మళ్ళీ కరిగించి తయారు చేయాల్సిందే.

అందువల్ల క్రీస్తు పూర్వం 2500 – 1800 ప్రాంతంలో ఇప్పటి టర్కీలోని అనటోలియా ప్రాంతంలో ఇనుము తయారు చేసే వారు. ఇనుము కాంస్యం కన్నా చాలా గట్టిది. ఆయుధాలు, ఇతర పని ముట్లు మొద్దు బారినప్పుడు రుద్ది తిరిగి కొత్తగా చేసేవారు. తిరిగి కరిగించి, తయారీ చేయాల్సిన అవసరం ఉండేదికాదు. పైగా, ఇనుము తయారీకి అవసరమైన ఇనుప ఖనిజం, సున్నపు రాయి, బొగ్గు ఎన్నో దేశాలలో విస్తారంగా ఉండేది. అందువల్ల ఇనుము వాడకం అన్నీ దేశాలలో వేగంగా విస్తరించింది. కాంస్యం కాలంలో ఇనుము ధర బంగారం ధర కన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా ఉండేదట. మన దేశంలో ఇప్పటి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో క్రీస్తు పూర్వం 1800–1200 మధ్య ఇనుము తయారీ ప్రారంభమైందని తెలుస్తుంది. యూరోప్ (బ్రిటన్‌తో సహా), అమెరికాలలో ఇనుము వాడకం చాలా ఆలస్యంగా ప్రారంభమైంది. అయినా, పారిశ్రామిక విప్లవం తరువాత ఈ దేశాలలో ఇనుము వాడకం ఆసియా, ఆఫ్రికా దేశాల కన్న చాలా అధికంగా ఉండేది. ఇనుము వాడకం ప్రారంభమైన తరువాత కాంస్యం వాడకం బాగా తగ్గిపోయింది.



ఇనుము వాడకం ప్రారంభమైన తరువాత ఆయుధాలు, ఓడల తయారీ బాగా పెరిగింది. యుద్ధాలు పెరిగాయి. సామ్రాజ్యాలు విస్తరించాయి. ఇండియా లాంటి దేశాలు సామ్రాజ్య దేశాలకు వలస దేశాలుగా మారి అభివృద్ధిని కోల్పోతాయి.

క్రీస్తు పూర్వం 3500 నుండి 1100 మధ్య కాలాన్ని కాంస్యయుగంగా పిలుస్తున్నారు. అంటే, ఈ కాలంలో కాంస్యం వాడకం బాగా ఉండి, మానవ అభివృద్ధిలో కీలకమైన పాత్ర వహించింది. క్రీస్తు పూర్వం 1800 ప్రాంతంలో ప్రారంభమైన ఇనుము వాడకం ఇప్పటికీ పెద్ద ఎత్తున కొనసాగుతుంది. అయితే క్రీస్తు పూర్వం 1100 నుండి క్రీస్తు పుట్టిన తరువాత 200 సంవత్సరాల వరకు ఇనుము మానవ అభివృద్ధిలో అతి కీలకమైన పాత్ర వహించింది. అందువల్ల, ఈ కాలాన్ని ఇనుప యుగంగా పిలుస్తారు. ఆ తరువాత ఇప్పుడు మనకు తెలిసిన, తెలుస్తున్న అన్నీ లోహాలు, వాని మిశ్రమాలు మానవ అభివృద్ధిలో ప్రముఖమైన పాత్ర వహిస్తున్నాయి.

అందువల్ల ఇప్పటి మానవ నాగరికత, సంస్కృతిలో లోహాల వాడకం ప్రారంభం ఒక ముఖ్యమైన మైలు రాయిగా కొనసాగుతుంది.

# శుభాకాంక్షల సూచి



హాయ్ ఫ్రెండ్స్! ఎలా ఉన్నారు? మీకేమీ బాగానే ఉంటారు. కానీ నా పరిస్థితే ఏం బాగోలేదు. ఎందుకంటారా? మొన్న నా చిన్ననాటి స్నేహితురాలు భాగ్య పుట్టినరోజు. ప్రతి సంవత్సరం గుర్తు పెట్టుకొని మరీ శుభాకాంక్షలు చెప్పేదాన్ని. కానీ ఈసారి.... ఇదిగో ఈ పరీక్షల హడావుడిలో పడి మర్చిపోయాను. తనేమో నా మీద అలిగి కూర్చుంది. 'హైస్కూల్లో చేరాక నీకు కొత్త కొత్త స్నేహితులు దొరికారు. అందుకే నా గురించి మర్చిపోయావ'ంటూ తెగ ఏడ్చేస్తోంది. దాన్ని ఓదార్చడం నావల్ల కాలేదు. 'ఇకమీదట ఇలాంటి తప్పు చేయను తల్లీ...! నన్ను మన్నించు' అని వేడుకున్నా వింటేగా. అప్పుడు భాగ్య వాళ్లమ్మ ఓ సలహా ఇచ్చింది. ఆంటీ చెప్పినట్లు చేశాను. ఇకమీదట నేను నాకు సంబంధించిన వాళ్ల పుట్టినరోజుల్ని మర్చిపోయే ప్రసక్తే లేదు. 'ఎందుకంత ధీమా?' అనే కదూ మీ సందేహం. మరి మా ఆంటీ ఇచ్చిన సలహా అలాంటిది మరి. ఇంతకీ ఆంటీ సలహా ఏంటో తెలుసా?

పుట్టిన రోజుల క్యాలెండర్ తయారుచేయడం. ఆ క్యాలెండర్‌లో ఒక్క పుట్టిన రోజులే కాదు. పెళ్లిరోజులు, ఇతర ముఖ్యమైన తేదీలను కూడా గుర్తు పెట్టుకోవచ్చు. ఏ నెలకు సంబంధించిన పట్టిక ఎదురుగా ఆ నెలలో వున్న ముఖ్యమైన తేదీలను, సందర్భాన్ని రాసి పెట్టుకుంటే సరి. నెలకోసారి ఆ పట్టికను సరిచూసుకొని, మనకిష్టమైన వాళ్లకు ముందుగా మనమే శుభాకాంక్షలు తెలియచేయవచ్చు. ఇదేదో బాగానే వుంది కదూ. మరెందుకు ఆలస్యం? వెంటనే క్యాలెండర్ తయారుచేయడమెలాగో నేర్చేసుకుందాం రండి. కాదు... కాదు... చదవండి.

- జ్యోతిర్మయి

**ఏమేం కావాలంటే?**

మందపాటి రంగు కాగితాలు రెండు, ఒక పిన్ను, పెన్సిల్, వృత్తలేఖిని, కాగితం, స్కేలు, స్కెచ్‌పెన్ను.







## ఎలా తయారు చేయాలి?

ముందు రెండు రంగు కాగితాల మీద వృత్తలేఖినితో పెద్ద వృత్తం (సున్నా) గీయండి. ఇప్పుడు ఒక కాగితాన్ని పక్కన పెట్టండి. రెండో కాగితాన్ని తీసుకొని, మొదట గీసిన వృత్తం లోపల చిన్న వృత్తాలు గీయండి. ఒక వృత్తానికి రెండో వృత్తానికి మధ్యలో మనం ఏదైనా రాసుకోడానికి కాస్త ఖాళీ వుండేలా చూసుకోండి. ఇలా మీకు ఎన్ని వృత్తాలు గీయడానికి వీలైతే అన్నీ గీయండి. తర్వాత మొత్తం వృత్తాన్ని 12 భాగాలుగా విభజిస్తూ (ఒకటవ బొమ్మ) స్కేలుతో గీతలు కొట్టండి. ఇప్పుడు బయటివైపు వున్న గళ్లలో నెలల పేర్లు జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్..... అంటూ వరుసగా రాయండి. వాటి కింద వున్న గళ్లల్లో ఆయా నెలల్లో మీకు ముఖ్యమనిపించిన తేదీలతోపాటు సందర్భాన్ని కూడా రాయండి. అది పుట్టిన రోజైనా, పెళ్లిరోజైనా లేదా ఇంకేదైనా ముఖ్యమైన రోజైనా సరే... అందులో రాసి పెట్టుకోండి.

ఇప్పుడు దీన్ని పక్కన పెట్టి, ఇందాకటి కాగితాన్ని తీసుకోండి. దీని పై భాగంలో రెండవ బొమ్మలో చూపించిన విధంగా పెన్సిల్‌తో మార్కు చేయండి. తర్వాత అంతవరకు జాగ్రత్తగా కత్తిరించండి. ఇప్పుడు దీన్ని ఇందాక నెలల పేర్లు రాసిన కాగితం మీద పెట్టండి (మూడవ బొమ్మ). రెండు పేపర్లను కలుపుతూ మధ్యలో ఒక పిన్ను లేదా గుండుసూదిని అమర్చండి. అయితే ఇక్కడ ఓ చిన్న జాగ్రత్త తీసుకోవాలి. అదేంటంటే... పిన్ను అమర్చినప్పటికీ పైన, కింద వున్న కాగితాలు గుండ్రంగా తిప్పితే తిరిగేలా ఉండాలి.

ఇప్పుడు పైన వున్న కాగితం మీద మీకు నచ్చిన డిజైన్ వేయండి. వీలైతే దానికి రంగులు కూడా అద్దండి. ఇప్పుడు అందమైన 'శుభాకాంక్షల సూచి' తయారయ్యింది కదూ. దీన్ని తీస్కెళ్లి, మీ గదిలో పెట్టుకోండి.

కాకపోతే ఒకటి.... దీన్ని వారానికోసారైనా చూడండి. ఆ వారంలో మీ సన్నిహితులకు సంబంధించిన ముఖ్యమైన తేదీలు ఏమైనా వున్నాయేమో చూసుకోండి. చూసుకొని ఊరుకోకుండా.... ఆ రోజున మర్చిపోకుండా వాళ్లకు శుభాకాంక్షలు తెలియజేయండి. సరేనా!













(పద ప్రహేళిక)

ఆచార్య నందూరి గోవిందరావు

కింద ఇచ్చిన దీర్ఘ చతురస్రంలో అడ్డం, నిలువు ఆధారంతో ఎంపిక చేసుకొన్న పదంతో పూర్తి చేయండి. పదంలో ఉండాల్సిన అక్షరాల సంఖ్య ఆధారం పక్క బ్రాకెట్టులో ఇవ్వబడింది. ఇవి ఒక రకమైన పొడుపు కథలు. నక్షత్రం ఉన్న గడిని ఖాళీగా వదిలి వేయవచ్చు. కరెక్టు సమాధానాలు ఇదే సంచికలో వేరే పేజీలో ఇవ్వబడ్డాయి. వీనితో మీ సమాధానాలను పోల్చి చూసుకోండి.

**ఆధారాలు**

**అడ్డం :**

1. కర్షకులు, వ్యవసాయం చేసేవారు ( 5 )
4. లక్ష్మీదేవి; సంపద; శోభ ( 2 )
6. ఎవడి గురించి వాడు చెప్పుకొనేటప్పుడు వాడే పదం, ఆత్మార్థకం ( 2 )
8. నూనె ( 3 )
9. గొంతులో నుండి వచ్చే ధ్వని ( 5 )

**నిలువు :**

1. చేసిన మేలు మరువక పోవటం ( 4 )
2. పెండ్లి కుమార్తె ( 3 )
3. రక్తము ( 4 )
5. పూల మాలలో కలిపి కట్టే సువాసన గల ఒక జాతి మొక్క ( 4 )
7. పాప ఫలం అనుభవించే లోకం ( 3 )

## మా అక్క

ఇంటి ముందు చిమ్మింది అక్క
మా అక్క చక్క చక్కని చుక్క
పెట్టింది ముగ్గు అందంగా
దానిపై గొబ్బెమ్మ మురిపెంగా
గొబ్బెమ్మపై ఉంచింది బంతిపువ్వు
మురుస్తూ నవ్వింది చిరునవ్వు
నీళ్ళు తెచ్చినందుకు
ముగ్గు ఇచ్చినందుకు
అక్క నన్ను మెచ్చుకుంది
లడ్డు తీసి ఇచ్చింది.

**- కె. విజయభాను**




# 'మూర్ఖపు ముని'

- పుప్పాల కృష్ణమూర్తి

రెండో పిట్ట నేల మీద వాలి, 'కథ చెప్పనా?' అంది.

"ఊ.... చెప్పు చెప్పు." అంది ఉహగా వడ్ల గింజల్ని కాపలా కాస్తున్న నాగమ్మ.

"ఇది మా తాతయ్య చెప్పిన కథ. నీకు చెబుతున్నాను. పూర్వం 'కంకరుడు' అనే ఛాదస్తపు ముని ఉండేవాడు. నియమాల పట్ల ఎంత కఠినంగా ఉండేవాడంటే ధ్యానం కూర్చున్నప్పుడు, శిష్యుడు బుడ్డి చెంబును తన కుడివైపున ఉంచాడని తన్ని తరిమేశాడు. తు... చ... తప్పకుండా నియమాలు పాటిస్తున్న తనకు తపో శక్తి, మంత్ర శక్తి కూడా ఉంది అనుకునేవాడు. "అనుకున్న సమయానికి, అనుకున్నట్లు అన్నీ ఖచ్చితంగా జరిగిపోవాలి'' అనేవాడు. తనలా ఆచరించడమే గాదు. శిష్యుల చేత కఠినంగా ఆచరింపజేసేవాడు.

ఒకసారి రాజు ఆహ్వానం మీద పక్క రాజ్యానికి బయలుదేరాడు. తెల్లవారు జామున లేచి, శిష్యుల్ని వెంటబెట్టుకుని, నడవసాగాడు. తెల్లవారే సరికి అడవిలోకి ప్రవేశించారు. అలా సూర్యోదయం అవుతుంటే ఇలా నదిలోంచి అర్ఘ్యము వదిలేవాడు రోజూ. గడియ కూడా తేడా రానిచ్చేవాడు కాదు.

'ఇంకాసేపట్లో దినకరుడు అంటే సూర్యుడు ఉదయిస్తాడు. మనం స్నానం చేసి, సంధ్య ధారిస్తే, సక్రమంగా ఉంటుంది."



అన్నాడు నదిని చూసి.

"ఇది అడవి కాబట్టి క్రూర జంతువులుండొచ్చు. సాధ్యమైనంత త్వరగా అడవి దాటి వెళితే బావుంటుంది" అన్నాడో శిష్యుడు.

" మృగాలలో సింహము, పక్షులలో గరుత్మంతుడు ఆయనే. సర్వాంతర్యామి అయిన దేవ దేవుణ్ణి రోజూ ధ్యానించే మనకు భయమెందుకు? అన్నాడు చాదస్తపు గురువు.

" ఛాదస్తపు గురువు చెపితే వినడు. వంట బట్టదు. స్నానమైతే వేద మంటాడు" అనుకుంటూ నదిలోకి దిగారు. స్నానం చేసి, సంధ్య వార్చాక, పక్కనున్న మర్రి చెట్టు కింద కూర్చున్నాడు. విధిలేక ఎదురుగా కూర్చోగా, యజుర్వేదం బోధించసాగాడు.



నీటి కోసం నది కొచ్చిన ఏనుగుల గుంపు కాషాయ వస్త్రాలను చూసి బెదిరిపోయాయి. పెద్దగా ఘీంకరిస్తూ వారివైపే రాసాగాయి.

" గురువు గారూ! ఈ ఏనుగులు మనల్ని చంపేసేలాగున్నాయి. పారిపోవడం మంచిది అన్నాడు. శిష్యుడు.

పాఠం మధ్యలో ఆటంక పరిచినందుకు, నిన్ను బహిష్కరిస్తున్నాను. వెళ్ళు" అన్నాడు కోపంతో.

" మహా ప్రమాదం" అనుకుంటూ పరుగున వెళ్ళి, మర్రి చెట్టెక్కేశాడు శిష్యుడు. ఏనుగులు దగ్గరికి రావడం చూసి, మిగతా శిష్యులు కూడా, మమ్మల్ని కూడా'' బహిష్కరించినట్లే ప్రమాదం ముంచు కొస్తుంది" అనుకుంటూ పరుగెత్తి ఆ చెట్టు పైకెక్కేశారు.

గురువు దిగ్గున లేచి నిలబడి, "నిష్ఠా గరిష్టుడ్ని, నియమ బద్ధంగా జీవించే వాణ్ణి. ఆశ్రమ నియమాలను తూ...చ... తప్పకుండా పాటించే ఈ కంకరుడు వెనక్కు వెళ్ళిపొమ్మంటున్నాడు. వెళ్ళిపోండి. " అన్నాడు కమండలంలోని నీళ్ళు చేతిలోకి తీసుకుని, ఏనుగు వైపు చల్లుతూ.

ఆ నీళ్ళకు శక్తి ఉంటే గదా, ఆగి పోవడానికి? అంతే వేగంగా ఓ ఏనుగు వచ్చి తొండంతో మునిని చుట్టి నేలకేసి కొట్టింది.

వాస్తవ పరిస్థితులు గ్రహించకుండా, మూర్ఖంగా ప్రవర్తించి అడవి జంతువులకు అన్యాయంగా బలైపోయిన గురువును చూసి శిష్యులు ఎంతో దుఃఖ పడ్డారు. శవ దహనం గావించి, జాగ్రత్తగా అడవి దాటారు.

"చుశావా నాగమ్మా! వాస్తవ పరిస్థితులను గ్రహించి ప్రవర్తించాలే గాని, మూర్ఖత్వం పనికి రాదన్న మాట; అని రెండో పిట్టనే హితబోధ చేసింది.

అపుడు " నాగమ్మ, నీ కథ బాగుంది. నీ గింజ తీసుకుని వెళ్ళు" అనగానే వడ్ల గింజను అందుకుని, తుర్రున చెట్టెక్కేసింది రెండో పిట్ట.







దేవరకొండ శ్రీను, 7వ తరగతి,
ఎం.పి.యు.పి. స్కూలు,
అరట్లకోట, పాయకరావుపేట,
విశాఖపట్నం జిల్లా



వి. నరేష్, 7వ తరగతి,
ఎం.పి.యు.పి. స్కూలు,
అరట్లకోట, పాయకరావుపేట,
విశాఖపట్నం జిల్లా






ఒరే రామూ! యి స్కూల్లో నీకు ఎవరంటే ఇష్టం?

లాంగ్ బెల్ కొట్టె రామయ్య సార్!

ప్రవీణ్




ఏరా! ఎవరెస్ట్ శిఖరాన్నే ఎక్కుతాననే
వాడివి ఎంత వరకు వచ్చింది?
ఎక్కుదామనే వెళ్ళా!
కాని నాకన్నా ముందు
చాలా మంది ఎక్కేశారట.
అందుకే మానేశాను.


డాడీ! నాకో
రూపాయి ఇవ్వవా?
డాడీని విసిగించుకురా!
ఇప్పుడే కొత్త వంకాయతో
భోం చేసి మంట మీదున్నాడు



# "కన్నా" డౌట్స్



1 సూర్యుడు ఎప్పుడూ ఎండలోనే ఉంటాడు పాపం ఎలా తట్టుకుంటాడో.....?

2 పిల్లలు దేవుళ్లతో సమానం. కాని మా మమ్మికి కోపం వచ్చినపుడు.....?

3 ఒకసారి మనల్ని ఎవరైనా గాడిద అంటే బాధపడ్తాం మరి పాపం గాడిదలెంత బాధ పడ్తాయో.....?

4 మమ్మల్ని టీచర్లు కొడ్తున్నారంటే వాళ్ల టీచర్ల మీద కక్ష మాపై తీర్చుకుంటు న్నారేమో.....?

5 నాకోసం మామమ్మీ వాళ్ల మమ్మీని వదలి నాన్న దగ్గరికొచ్చిందేమో.....?

6 మా బుక్స్‌ల మోత ఈ రోజుల్లో గాడిదలు కూడా మోయడం లేదేమో......?

7 మమ్మీని అడగనిది నాన్న ఏ పనీ చెయ్యడు అతనికి ఇంకా స్వాతంత్రం రాలేదేమో..?

8 బఫెల్లోల్లార భోంచేయడం వలన "బఫ్ సిస్టం" పేరొచ్చిందేమో....?

- గంధం శ్రీనివాస్



# సుత్తి బొండాం



మిథల : మమ్మీ....! ఎవరొచ్చారో చూడు

పిల్లి : ఎవరొచ్చారే....?

మిథల : పనికి మాలిన సుత్తి బొండాం అంటావే ఆ ఆంటీ వచ్చింది

# హనీమూన్



తండ్రి : ఎందుకురా... కన్నా... ఏడుపు?

కన్న : బాబాయి, పిన్ని నన్ను తిరుపతి తీసుకెళారు...!

తండ్రి : అయితే సంతోషమే కదా...!

కన్న : కాని ఇప్పుడు హనీమూన్‌కు నన్ను తీసుకెళ్లడం లేదు....!

# పిల్లలు



చిన్న : ఒరె కిరీట్...! పిల్లలు ఎలా పుడ్తారో నాకు తెలుసు....!

కిరీట్ : నాకు ఐతే... కవల్లలు ఎలా పుట్టరో కూడా తెలుసు

# కుక్క



సోను : అంకుల్....: అంకుల్....

అంకుల్ : చూడు సోను ఇలా భోజనాల మధ్య మాట్లాడొదు వెళ్లు....

సోను : ఏంటి అంకుల్....?

అంకుల్ : ఇందాక ఏదో మాట్లాడబోయావ్...

సోను : మీరు భోంచేస్తూ మధ్యలో నీల్లు తాగడానికి వెళ్లినపుడు మీ ప్లేట్లో కుక్క మూతి పెట్టింది

- గంధం శ్రీనివాస్

## ఇంగ్లీషు + తెలుగు అక్షరాలు = తెలుగు పదాలు

**" D " తో గారడి**

బ 'D'
గు 'D'
లే 'D'
కో 'D'
బీ 'D'
నా 'D'
పా 'D'
కు 'D'
కే 'D'
గ 'D'
మో 'D'
పొ 'D'
బే 'D'
బో 'D'
మే 'D'
ళా 'D'

**'1' తో తమాషా**

ONE
1 కాయ
1 తెన
1 దనం
1 వాసం
1 కర
1 ట

**' A ' తో రాత**

'A' నుగు
'A' క్కిళ్ళు
'A' లుక
'A' ద్దు
'A' కాంతం
'A' సరు
'A' వరెస్టు
'A' రువాక
'A' నిమిది
'A' ంటివా

**' C ' లో సింగారం**

కృ 'C'
ఏ 'C'
మ 'C'
రా 'C'
ఓ 'C'
గో 'C'
మో 'C'
రా 'C'
దా 'C'
పూ 'C'

**' V ' తో మలుపు**

చిరంజీ 'V'
క 'V' త
స 'V' త
'V' నోద్
'V' జయ్
'V' క్రమ్
'V' లాస్
'V' ద్యార్థి
'V' క్టోరియా

**' E ' తో ఈత**

'E' బ్రహీం
'E' ంజన్
'E' కలు
'E' ందనం
'E' త
'E' గ
'E' రుకు
'E' శ్వర్
'E' ల్లు
'E' గ
'E' టుక
'E' నుము

నిర్వహణ : స్నేహిత్,
3వ తరగతి, భైంసా

## దేవుడిచ్చిన దేవత అమ్మ

అమ్మ అనే అక్షరాల నిండా ఆత్మీయత
అమ్మకన్నా మేలిమైన
కలిమి ఏముంది?!
అమ్మ అనే పిలుపునిండా అమృతం
ప్రపంచాన ఆ పిలుపుకన్నా
తీయనైనది ఏముంది?!

అమ్మ అనే భావం నిండా ప్రేమ
జగతిన ఆ మూర్తి కన్నా
గొప్పదైనది ఏముంది?!

అమ్మ చూపే మమతనిండా అనురాగం
అమ్మ హృదయంలో నీపై ఉన్న ప్రేమకన్నా
నీవు గెలుచు రాజ్యమేముంది?
ఆపదలో అసరా అమ్మ
సంతోష సాగరం అమ్మ
మమతానురాగాల అంబరం అమ్మ
ప్రతి మనిషికి
దేవుడిచ్చిన దేవత అమ్మ!

చిట్టి పొట్టి పాపలం
సిరిమల్లె పువ్వులం
నింగి నుండి నేల దిగిన
పసిడి వెన్నెల తునకలం

కోకిల పాటకు తాళం వేస్తాం
పాముతోనైనా స్నేహం చేస్తాం
లోకమంతా మాదేనంటాం
అందరినీ కలుసుకుపోతాం

- కె. విజయభాను

# పిండి బొమ్మ వీరుడు

**(సంయుక్తాక్షరాలు లేని కథ)**

ఒకూరిలో ఒక ముసిలి తాత ఉండేటోడు. వానికి అన్నీ ఉన్నాయి గానీ పిల్లల్లేరు. దాంతో ఒకరోజు గోధుమ పిండితో ఒక చిన్న బొమ్మ చేసి, దానినే సొంత కొడుకుగా చూసుకోసాగాడు.

ఆ పిండిబొమ్మను ఉయ్యాలలో పన్నబెట్టి
" పడుకో.... పడుకో....
హాయిగా పడుకో
పిండిబొమ్మ పిల్లోడా హాయిగా
పడుకో"

అని పాట పాడుతూ వూపేటోడు.



ఒక రోజు ఆకాశంలో దేవతలు పోతాపోతా ఇది చూసినారు. "అరెరే... పాపం... ఈ ముసిలోనికి ఎవరూలేరే" అని జాలిపడి ఆ బొమ్మకే జీవంపోసి పోయినారు.

ఉయ్యాలలోంచి కెవ్వుమని కేకవినబడగానే ముసిలోడు అదిరిపడి లేచి చూసినాడు. ఇంకేముంది పిండిబొమ్మ కదులుతూ కనబడింది. ముసిలి తాత సంబరంగా ఆ పిండిబొమ్మను బైటకు తీసినాడు.

"ఏడవకు...ఏడవకూ... పిండిబొమ్మ పిల్లోడా
నీ కళ్లలో నీళ్ళునే చూడలేనూ"

అని జోలపాట పాడుతా ముద్దు పెట్టుకొన్నాడు. ఆ రోజు నుండీ ఆ తాత ఆ పిండిబొమ్మ పిల్లోణ్ణి ఉన్నకొడుకు లెక్క బాగా చూసుకునేటోడు.

ఆ తాత ఒకప్పుడు రాజు దగ్గర సైనికుడుగా పని చేసినోడు. దాంతో ఆ పిండిబొమ్మకు కత్తితిప్పడం, గుర్రం తోలడం, బాణాలు ఎయ్యడం అన్నీ నేరిపించి పెద్ద వీరునిగా తయారు చేసినాడు.

ఒక రోజు ఆ పిండి బొమ్మ వీరుడు " తాతా... తాతా... నేను అలా అడవిలోనికి పోయి ఏమేమి జంతువులు వున్నాయో తెలుసుకుంటూ" అని చెప్పి అడవిలోనికి పోయినాడు.

అలా పోతా పోతా ఉంటే వానికి ఒకచోట జంతువులన్నీ గుంపుగా చేరి కనబడ్డాయి

ఎందుకబ్బా.... అలా గుంపుగా వున్నాయి. అని పోయి చూసినాడు. అక్కడ జంతువులన్నీ తమలో ఒకరిని రాజుగా ఎన్నుకోవాలని అనుకుంటున్నాయి. పెద్ద పెద్ద జంతువులన్నీ నేను రాజునంటే, నేను రాజునంటూ అరచుకోసాగాయి.

మన పిండిబొమ్మ వీరుడు అది చూసి ఆ జంతువుల కాడికి పోయినాడు. జంతువులన్నీ వానిని వింతగా చూసినాయి. వెంటనే ఆ పిండిబొమ్మ వీరుడు గట్టిగా



" పక్షిలాగ ఎగురుతా
చేపలాగ ఈదుతా
లేడిలాగ ఉరుకుతా
పులిలాగ దుంకుతా
నా [illegible]
లోకాన లేడులే
పిండిబొమ్మ వీరున్ని
నేనేలే [illegible] .... అని పాట
పాడినాడు.

అది విని జంతువులన్నింటికీ చానా కోపమొచ్చేసింది. లేడిపిల్ల కోపంగా వాని ముందుకొచ్చి " గింతగూడా లేవు. నీవు మా రాజువా. ఏదీ నా అంతవేగంగా వురుకు చూద్దాం"



## చీమల వంతెన

అమెజాన్ పరిసర ప్రాంతాల్లోనూ ఆఫ్రికాలోనూ కన్పించే ఎసిటన్ చీమలు మూకుమ్మడిగా పెద్ద సంఖ్యలో ఒక చోట నుండి వేరే చోట్లకు తరలిపోతుంటాయి. దారిలో దొరికినవి తింటూ మార్గ మధ్యంలో ఏవైనా వాగులు లేదా నదులు అడ్డొచ్చినా అవి తమ ప్రయాణాన్ని ఆపవు. ఒకదాని నొకటి పట్టుకొని గట్టి గోలుసులా ఏర్పడతాయి. మిగిలినవి వాటి మీద నుండి నడచి ఆవలవైపుకు పోతాయి. ఒక్కోసారి ప్రవాహం దాటి ఎక్కువగా ఉంటే ఫోటోలో కన్పిస్తున్నట్లుగా బంతిలా గుండ్రంగా చుట్టు చుట్టుకుపోయి, ఆ ప్రవాహం దిగువవైపు ఆవల ఒడ్డును చేరతాయి. ప్రవాహం ఎంత వేగంగా వున్నా ఇవి మాత్రం గట్టిగా ఒకదానినొకటి పట్టుకొని ప్రయాణిస్తాయి.

# పిల్లల లోకం

పేరుకి చిన్న పిల్లలే కాని పిల్లల ప్రపంచం చాలా పెద్దది. చాలా మంది పెద్దవాళ్ళ ప్రపంచం వలె చిన్నదీ, ఇరుకుదీ కాదది. హద్దులూ, అంక్షలూ వున్న ప్రవంచం కాదది. కళ్ళ ముందు సెలయేర్లను ఊహించుకుని వెన్నెలలో చేసిన పడవలపై చుక్కల పువ్వుల వనాలలోంచి విహరించి రాగలరు. పావురపు రెక్కల కింద గుడ్లు ఎన్నడు పిల్లలుగా మారి కువకువమంటూ వస్తాయో అని పెద్ద పెద్ద కళ్ళతో ఎదురు చూస్తారు. ఆకాశమార్గన ఊరించి వెళ్ళే నల్లటి మేఘాల చల్లదనాన్ని ఊహించి అనుభవించగలరు.

ఎల్లలు లేని లోకాల్లో తిరిగే పిల్లల కోసం కొన్ని కథలు, పాటలు, కవితలు, జ్ఞాపకాలు ఇక నుంచి నెల నెలా అందిస్తాం. పిల్లలూ పెద్దలూ అందరూ ఈ శీర్షికకు రచనలు పంపించొచ్చు.

**- సంపాదకవర్గం**

## బంగారు బొమ్మలు

బాలలం బాలలం
బంగారు బొమ్మలం
భరత మాత కలలన్ని
పండించు పాపలం
నేల తల్లి పౌరులం
నింగిలో చుక్కలం
రివ్వున ఎగిరే పతంగులం
తెలుగు తల్లి పిల్లలం

– వి. దుర్గారావు, 6వ తరగతి,
ఎం.పి.యు.పి. స్కూలు,
అరట్లకోట, పాయకరావుపేట,
విశాఖపట్నం జిల్లా





# పిల్లలం మేం పిల్లలం

పిల్లలం మేం పిల్లలం
అరవిచ్చే పువ్వులం
వెలిగే దివ్వెలం
అమ్మంటే ఎంతో ఇష్టం
నాన్నంటే మరీ ఇష్టం
గురువులంటే మరీ మరీ ఇష్టం
పాఠాలన్నీ చదివేస్తాం
ఫస్టు మార్కులు తెచ్చుకుంటాం
కమ్మని కలలెన్నో కంటాం
ఆకాశానికి ఎగురుతాం
ఇంద్ర ధనుస్సు పై ఎక్కేస్తాం
చందమామపై ఆటలు ఆడుతాం
నక్షత్రాలన్నీ ఏరుకొస్తాం
సాహసాలెన్నో చేసేస్తాం
ఖండాలన్నీ చుట్టేస్తాం
సముద్రాలన్నీ ఈదేస్తాం
ఎవరెస్టును ఎక్కేస్తాం
కులం లేదు మతం లేదు మాకు
మానవులంతా ఒకటే అంటాం
మానవతే మా మతం
మంచి తనమే మా కులం
ఇరుగు పొరుగును ప్రేమిస్తాం
ప్రేమిస్తే ప్రాణాలిస్తాం
ద్వేషిస్తే ఎదిరిస్తాం
ఆటలెన్నో ఆడుతాం
పాటలెన్నో పాడుతాం
మాయా మర్మం ఎరుగనివాల్లం
కల్లాకపటం తెలియనివాల్లం
అందరిని ప్రేమిస్తాం
అందరికి సాయపడతాం
పిల్లలం మేం పిల్లలం

**- మేరెడ్డి యాదగిరిరెడ్డి**



# నిర్ణయం

- లిఖిత

ఫ్రెండ్స్! కొత్త సంవత్సరంలోకి వచ్చేశాం. ఒక నెల కూడా అయిపోయింది. అన్నట్టు కొత్త సంవత్సరమంటే నా చిన్నప్పుడు జరిగిన ఓ సంఘటన గుర్తొచ్చింది. అదేంటో చెప్పనా?

మాది గుంటూరు జిల్లాలోని మానుకొండవారిపాలెం. మా ఊళ్లో హైస్కూల్‌లేదు. ఐదవ తరగతి తర్వాత చదవాలంటే పక్కనే వున్న వేలూరు వెళ్లాలి. అందుకని మా ఊరి పిల్లలంతా వేలూరు వెళ్లి చదువుకునేవాళ్లం. అప్పుడు నేను ఏడవ తరగతి చదువుతున్నాను. ఆ రోజు జనవరి ఒకటవ తేదీ. స్కూల్‌కి సెలవు ఇమ్మని ముందు రోజే హెడ్మాస్టారుగారిని అడిగాం.

"సంవత్సరం మొదటి రోజే సెలవిస్తే సంవత్సరమంతా సెలవులే. అందువల్ల నేను సెలవు ఇవ్వను" అన్నారాయన. ఇంకేం.... మాకందరికీ బడికెళ్లక తప్పలేదు. అయితే మధ్యాహ్నం నుండి బడిలేదన్నారు. అందరం ఆనందించాం. ఇంటికెళ్లే దారిలో బోలెడన్ని రేగు చెట్లు. వాటి నిండా పండిపోయిన కాయలు. వాటిని కోసుకోడానికి కొంత మంది పరుగులు పెట్టారు. ఇంకొంతమంది నిదానంగా నడవసాగారు. ఇంతలో ఓ అబ్బాయి మా దగ్గరకొచ్చాడు. అతను క్రిస్టియన్.

మా ఫ్రెండ్ అరుణతో, "చెల్లీ...! నిన్ను ఇవాళ అమ్మ భోజనానికి తీసుకురమ్మంది. వస్తావా?" అని అడిగాడు.



అరుణ మా ఊళ్లోని స్కూల్లో పనిచేసే మాష్టారి మనవరాలు. వాళ్లూ క్రిస్టియన్సే. అందుకనే అతను ఆమెను 'చెల్లీ' అని పిలుస్తుండేవాడు. అరుణకు కూడా వెళ్లాలనే ఉంది. కానీ మళ్లీ వచ్చేటప్పుడు ఒక్కతే అవుతుందని భయం. ఆమె పరిస్థితి అతనికర్థమైంది.

"అరుణతోపాటు మీరూ మా ఇంటికి రావచ్చు'' అన్నాడతను. అమ్మాయిలమంతా సమావేశమయ్యాం.

"ఈ అబ్బాయి మంచోడే. వెళ్లొచ్చు. కానీ పల్లెలోకి వెళ్లామని తెలిసినా, అక్కడ మనల్ని ఎవరైనా చూసినా మన ఇళ్లల్లో వాళ్లు ఊరుకోరు. మరెలా?" అంది ఓ అమ్మాయి.



''ఎందుకని?'' అమాయకంగా అడిగాన్నేను.

"ఎందుకేంటి? మనం కాపులం. వాళ్ళు క్రిస్టియన్లు మరి అలాంటి వాళ్లిళ్లకు వెళ్లకూడదు" చెప్పిందో పెద్దమ్మాయి.

నాకాశ్చర్యమేసింది. అలాంటి మాట మొదటిసారి విన్నాను. అప్పటివరకు నాకిలాంటి పరిస్థితి ఎదురవలేదు మరి. ఊగిసలాడుతున్న అమ్మాయిల్ని అరుణ బతిమాలింది. దాంతో అందరూ ఒప్పుకున్నారు. అందరం కలిసి ఆ అబ్బాయి ఇంటికెళ్లాం.

వాళ్ల ఇల్లు ఊరి చివర్న వున్న పల్లెలో ఉంది. అక్కడి వాతావరణం మాకెందుకో కొత్తగా అనిపించింది. మురుగు కాలువకీ, రోడ్డుకీ తేడా లేదు. పశువుల్ని రోడ్ల మీదే కట్టేశారు. వాటిని దాటుకుంటూ వెళ్లడం కష్టమే అనిపించింది. కాసేపు నడిచాక వాళ్లింటికెళ్లాం. చిన్న ఇల్లు. దండెం మీద బట్టలు వేలాడుతున్నాయి. వంట గిన్నెలన్నీ కింద చెల్లాచెదురుగా ఉన్నాయి. వాళ్ల అమ్మ, చెల్లెలు, తమ్ముళ్లను పరిచయం చేశాడు. వాళ్లమ్మ నవ్వుతూ పలకరించింది. మేమెవరమో తెలిసిన తర్వాత అంతకుముందు కంటే ఎక్కువ మర్యాద చేయడం మొదలుపెట్టిందావిడ.

"మీబోటోళ్లు మా ఇంటికి రావడమే గొప్ప. కూర్చోండమ్మా...." అంటూ మంచం వాల్చి, దుప్పటి పరిచింది. ఇక మా అమ్మాయిలకు గర్వం పెరిగింది. తామేదో పై నుండి దిగొచ్చినట్లు భావించారు.

జనవరి ఫస్ట్‌ని క్రిస్టియన్స్ పండుగలా జరుపుకుంటారట. అందుకే ఆ రోజు వాళ్లింట్లో బిర్యానీ వండారు. వాళ్ల ఆరుగురికి వండిన బిర్యానీ మా అందరికీ పెట్టిందావిడ.

''అమ్మా! నాక్కూడా పెట్టు" అడిగాడు మా క్లాస్‌మేట్ వాళ్ల తమ్ముడు.

"నీకు తర్వాత పెడతాలే...." జవాబిచ్చిందావిడ. కానీ వండినదంతా మాకే పెట్టిందనే విషయం వాడికి తెలిసిపోయింది. మాకెదురుగా వున్న అన్నం కుండ ఖాళీగా వుంది మరి. ఆశగా మా చేతుల్లోని పళ్లాల వైపు చూస్తూ నిలబడ్డాడు. ఇక లాభంలేదని వాణ్ణి తీసుకొని అవతలికెళ్లింది వాళ్లమ్మ. మేం దీన్నంతగా పట్టించుకోలేదు. అందరం భోం చేసేలోగా ఆమె మళ్లీ వంట ప్రయత్నాలు మొదలుపెట్టింది. ఈసారి బిర్యానీ చేయట్లేదు. ఇంట్లో మిగిలిన సోలెడు నూకలతో గంజి వార్చబోతోంది. అనుకోకుండా వచ్చిన



అతిథులం అన్నం కుండ ఖాళీచేసి, వాళ్లకు గంజి నీళ్లు మిగిల్చి ఇంటిదారి పట్టాం.

"ఏమే.... సుశీల.... నా కడుపులో ఏదో తిప్పుతున్నట్టుగా ఉందే" అంది వర్ధని.

"ఎందుకని? ఏదైనా అరగనిది తిన్నావా?" అడిగింది సుశీల.

"లేదే... ఇందాక వాళ్లింట్లో బిర్యానీ తిన్న దగ్గర్నుండి నాకిలాగే ఉంది. ఏం నూనె వాడారో ఏమో. మొహమాటానికి తిన్నాను. తినకుండా వున్నా బావుండేది" నొచ్చుకుంది వర్ధని.

"నాకూ నచ్చలేదు. ఆమె ప్లేటులో పెట్టి మరీ ఇస్తే వద్దనలేక తిన్నాను. ఈ విషయం ఇంట్లో తెలిస్తే వీపు మీద విమానం మోతే" భయం నటించింది సుశీల.



"అయినా వాళ్లేంటి? అస్సలు నెయ్యే వాడినట్లు లేరు. అన్నమంతా పలుకుగా ఉంది. అందుకేనేమో కడుపులో తిప్పుతోంది. మా అమ్మ అయితే గిద్దెడు నెయ్యికి తక్కువ కాకుండా వేస్తుంది" గర్వంగా అంది వర్ధని.

ఇలా సాగుతోంది వాళ్ల సంభాషణ. వాళ్లకు మిగతా వాళ్లంతా వత్తాసు పలుకుతున్నారు. నాకెందుకో వాళ్ల మాటలు నచ్చలేదు.

'ఇష్టం లేకపోతే వద్దనవచ్చు. లేదా ఒక ముద్ద పెట్టించుకొని తినొచ్చు కదా. అప్పుడు సుష్టుగా తిన్నారు. ఇప్పుడేమో ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నారు. అసలు మేం వాళ్లింటికి వెళ్లకపోతేనే బావుండేది. వాళ్లైనా కడుపు నిండా తినేవాళ్లు. అరుణ ఏమీ మాట్లాడట్లేదేంటి? తను కూడా నాలాగే ఆలోచిస్తోందేమో. పాపం.... ఆ పిల్లవాడు ఎంత ఆశగా చూశాడు' ఇందాకటి దృశ్యాన్నే గుర్తు తెచ్చుకుంటూ స్నేహితురాళ్ల వెనుక నడుస్తున్నాను.

''జ్యోతీ... చూడు వాళ్లెలా మాట్లాడుతున్నారో. ఎంతైనా అన్నయ్య వాళ్ళు వీళ్లు మీ అంత కలిగినవాళ్లు కాదు. అంతమాత్రాన అలా మాట్లాడొచ్చా. ఈ విషయం తెలిస్తే మా అన్నయ్య ఎంత బాధపడతాడు. వీళ్ల గురించి తెలిసి తెలిసీ తీసుకెళ్లడం నాదే బుద్ధి తక్కువ" నా పక్కనే నడుస్తున్న అరుణ మాటలకు ఉలిక్కిపడ్డాను. ఆమె కళ్లల్లో సన్నని నీటిపొర. వీళ్ల మాటలు తననెంతగా కుంగదీశాయో అర్థమైంది నాకు.

"ఊరుకో... అరుణా..." అని మాత్రమే అనగలిగ్గాన్నేను.

ఆ రోజే నేనొక నిర్ణయానికొచ్చాను. మనం రోజూ ఎంతో మందిని చూస్తుంటాం. వాళ్లల్లో కొంత మంది కలిగినవాళ్లున్నారు. మరికొంతమంది పూట కూలి మీద ఆధారపడేవాళ్లున్నారు. అంతమాత్రం వాళ్లేమీ 'గొప్ప'వాళ్లకు తీసిపోరు. ఆర్థిక బలాన్ని పక్కనపెడితే అందరూ మనుషులే. మనుషుల్లోని మంచితనానికి చూడాలిగానీ వాళ్ల భోగభాగ్యాలను పట్టించుకోకూడదని నిశ్చయించుకున్నాను.

చదివారుగా ఫ్రెండ్స్! మీకూ ఇలాంటి చిన్న చిన్న సంఘటనలు ఎదురై ఉంటాయి. అప్పటికి మీరు పొరపాటు చేసినా తర్వాత మీలో మీరు ఆలోచించుకోండి. పొరపాట్లను గమనించండి. ఆ పొరపాటు మళ్లీ చేయకుండా జాగ్రత్త తీసుకోండి. అప్పుడే మనం సరైన మానవులుగా పెరిగి పెద్ద అవుతాం. 



## పుష్పాలు

అందమైన పుష్పాలు ఆనందాన్నిస్తాయి
అడుగడుగున పరిమళాలు
విరజిమ్ముతూ ఉంటాయి

అవి సదా దేశ భక్తుల
వీరత్వాన్ని చూసి
పొంగి పోతూ ఉంటాయి
వారి మెడలో హారమవ్వాలని
ఆతృత చెందుతుంటాయి

ఆ కోరిక తీరిన నాడు
జన్మ ధన్యమైనట్టు భావిస్తాయి
దేశ ద్రోహుల మెడలో చేరితే
కుమిలి కుమిలి ఏడుస్తాయి

**- ఎస్.కె. బుర్హాన్**

## బాలలూ!

బాలల్లారా! పాపల్లారా!
బంగరు నవ్వుల పువ్వుల్లారా
చక్కగ చదువులు చదవాలి
హాయిగ ఆటలు ఆడాలి
గొప్పగ బుద్ధిని పెంచుకొని
మంచిగ మంచిబాటలో
నడవాలి! ఎదగాలి!
పూజ్య బాపూజీ
బంగారు బాటలో నడవాలి
అహింసా మార్గం తలవాలి
సత్యమేవజయతే నినాదం పలకాలి
అంతా ఒక్కటిగా
మనమంతా ఒక్కటిగా
బంగరు నవ్వుల పువ్వుల్లారా
బాలల్లారా! పాపల్లారా!

**- లక్కరాజు ప్రఫుల్లచంద్ర**



# విరిచిన అగ్గిపుల్లను ఏకం చేసే అద్భుతశక్తి

మ్యాజిక్



ప్రదర్శన : మెజీషియన్ జేబు రుమాలు విసురుతూ, జాడించి బల్లమీద పెట్టి ప్రేక్షకుల నుండి అగ్గిపెట్టె స్వీకరించి ఒక ప్రేక్షకుడి చేత ఒక అగ్గిపుల్లను తీసి చేతిలో ఉంచుకోమంటాడు. అగ్గిపుల్ల మీద పెన్నుతో గుర్తు పెట్ట మంటాడు. ఆ అగ్గిపుల్లను జేబు రుమాలు మధ్యలో పెట్టి జరగమంటాడు. మెజీషియన్ మంత్రాలు చదువుతూ మడతలు పెట్టిన రుమాలును ప్రేక్షకుడి చేతికిచ్చి అగ్గిపుల్లను త్రుంచమంటాడు. ఇంకొక బలవంతుడయిన వ్యక్తిని పిలచి అతనిచేత కూడా ముక్కలు చేయిస్తాడు. రుమాలును క్రింద పెట్టి. అవెురికన్ బాబాను తలచుకుంటూ కుంకుమ చల్లి రుమాలును తెరచే సరికి విరచిన అగ్గిపుల్ల అతుక్కొని దర్శనమిస్తుంది. అగ్గిపుల్ల అదేనని గుర్తించి ఒప్పుకొంటాడు మొదటి ప్రేక్షకుడు. అబద్ధాలాడని, సచ్ఛీలుడయిన ఇంకొక వ్యక్తికి కూడా ఇలాంటి అనుభవం ఎదురవుతుంది.

**అంతరంగము :** అంచులు ప్రత్యేకంగా ఉన్న చేతి రుమాలులో ముందుగా రెండు వైపుల ఒక్కొక్క అగ్గిపుల్లను ఉంచాలి. ప్రేక్షకుడి చేతికిచ్చే మడతలోని పుల్ల రహస్యంగా దాచి ఉన్న అంచులోని పుల్లయై ఉండాలి.

**గమనిక :** ఒక ప్రదర్శన తర్వాత రెండవ ప్రదర్శన అవసరమైతే రెండవ రహస్య పుల్లను ఉపయోగించాలి. మెజీషియన్ ఎల్లప్పుడూ తన జేబులోని రుమాలులో రెండు అగ్గిపుల్లలను దాచి సిద్ధపరచుకొని ఉండుట మంచిది. ఎక్కడ, ఎప్పుడు అవసరమైనా ప్రదర్శించడానికి వీలవుతుంది.

## మాయమయ్యే పెన్సిలు



**ప్రదర్శన :** మెజీషియన్ ప్రేక్షకులవైపు నుండి పక్కలకు తిరుగుతూ దూరంగా ఉన్న ఒక వస్తువు మీద ఈ పెన్సిలు విసిరి నిలబెడతానని అంటాడు. అందరూ అతని చేతిలోని పెన్సిలు మరియు అతను చూపిన స్థానము వైపు కన్నార్పకుండా చూస్తుంటారు. మెజీషియన్ కుడిచేతిలోని పెన్సిలును గురిగా పెట్టి చేయి వెనుకకు తెచ్చి హూప్ అని విసరివేస్తాడు. పెన్సిలు మాయమై ఉండటం అందరికీ మిస్టరీగా ఉంటుంది. మరలా హూప్ అజావ్ అని పిలిచి చేయి ముందు వెనుకకు విసురుతూ పెన్సిలు చేతిలో సృష్టిస్తాడు.

**అంతరంగము :** ప్రేక్షకులకు ఒక ప్రక్కగా నిలబడి అనగా ఎడమభాగము కనిపించు విధముగా నిలబడి కుడిచేతిలోని విసురుతున్న ఫోజులో చేయు ముందు నుండి వెనుకకు వచ్చు సందర్భము కుడి చెవి డొప్ప పైభాగాన పెట్టాలి.

**గమనిక :** కుడి చెవిలోని పెన్సిలు కనిపించుకుండుటకుగాను పక్కకు తిరగరాదు. మరలా సృష్టించు వరకు అదే ఫోజులో ఉండాలి.

# అవసరం



\- జ్యోతిర్మయి

అనగనగా ఒక అడవి. ఆ అడవిలో ఏనుగులు, పులులు, సింహాలు, జింకలు, కుందేళ్లు, చిట్టెలుకలు..... ఇలా రకరకాల జంతువులుండేవి. అప్పుడే శీతాకాలం ముగిసింది. ఆకులు రాల్చిన చెట్లన్నీ తిరిగి చిగురిస్తున్నాయి. చలి తగ్గి ఎండలు ముదురుతున్నాయి. అంటే ఎండాకాలం రాబోతోందన్నమాట. ఆ సంవత్సరం వర్షాలు చాలా తక్కువగా కురవడానేమో ఎండలు ఎక్కువగా ఉన్నాయి. మండుటెండలు మొదలవ్వకముందే అడవిలోని చిన్నాచితక కుంటలు ఎండిపోసాగాయి. ఎండలు ఇలాగే కొనసాగితే మరో నెల రోజుల్లో అడవిలో చుక్క నీరు దొరకదు. అప్పుడు జంతువులన్నీ ఆకలికి అల్లాడిపోతాయి.

ఇలాంటి పరిస్థితే కొన్ని సంవత్సరాల క్రితం కూడా ఎదురయ్యింది. అప్పట్లో చాలా జంతువులు తాగడానికి గుక్కెడు నీళ్లు లేక చనిపోయాయి. మిగిలిన జంతువులన్నీ కలిసి అప్పుడే ఓ నిర్ణయం తీసుకున్నాయి. ఇలాంటి పరిస్థితి ఇకముందు ఎదురవకుండా వుండాలంటే బాగా లోతైన చెరువునొకదాన్ని తవ్వాలని అవి నిర్ణయించాయి. అనుకున్నట్టుగానే ఓ పెద్ద చెరువు తవ్వాయి కూడా. ఎంత ఎండాకాలమైనా ఆ చెరువు ఎండిపోదు. ఇప్పుడు ఆ చెరువే అడవిలోని జంతువులన్నింటికీ ప్రాణాధారమైంది.

ఇదిలావుండగా చుట్టుపక్కల ప్రాంతాల్లోని అడవుల్లో పరిస్థితి మరో రకంగా ఉంది. అక్కడ తాగడానికి నీళ్లు లేక జీవాలన్నీ ఇబ్బందులుపడ్తున్నాయి. నీళ్లు దొరికే తావులు వెతుకుక్కుంటూ జనావాసాల్లోకి కూడా వెళ్తున్నాయి. అలా వెతుక్కుంటూ ఓ ఏనుగుల గుంపు ఈ అడవికి వచ్చింది. అలా వలస వచ్చిన ఏనుగుల గుంపుకు ఇక్కడి జంతువులు సాదరంగా ఆహ్వానం పలికాయి. మళ్లీ వర్షాలు పడేంతవరకు ఇక్కడే వుండొచ్చని భరోసా కూడా ఇచ్చాయి. దానికి ఆ ఏనుగులు కూడా



ఎంతో సంతోషించాయి.

కానీ ఇక్కడే ఓ చిక్కు వచ్చి పడింది. అదేంటంటే.... వలస ఏనుగులకు హడావుడి ఎక్కువ. ఏదైనా పని చేయాలనుకుంటే అఘమేఘాల మీద పరు గెత్తుతాయి. తమ దారికి అడ్డొచ్చిన ప్రతిదాన్నీ తోసు కుంటూ ముందుకెళ్తుంటాయి. దానివల్ల అడవిలోని చెట్లన్నీ నాశనమవుతున్నాయి. ముఖ్యంగా చెరువుకు దగ్గర్లో వున్న చెట్లు చాలావరకు మాయమయ్యాయి. ఆ చెట్ల మీద గూళ్లు కట్టుకున్న పక్షుల, వాటి దరిదాపుల్లో బొరియలు చేసుకొని జీవిస్తున్న చిట్టెలుకలకు ఆవాసాలు (ఇళ్లు) కరువయ్యాయి. పైగా ఏనుగులు మంచి నీళ్ల తాగడానికి వచ్చేటప్పుడు ఉరుకులు పరుగుల మీద వస్తుంటాయి. ఆ హడావుడిలో తమ కాళ్ల కింద ఏమైనా పడ్తున్నాయేమోనని కూడా గమనించవు. దీంతో రోజు రోజుకీ ఏనుగుల కాళ్ల కిందపడి మరణించే చిన్న ప్రాణుల సంఖ్య పెరిగిపోతోంది. వాటిలో చిట్టెలుకలే ఎక్కువ ఉన్నాయి. దీన్ని మూషిక (ఎలుక) రాజు గమనించాడు. ఏదైనా ఒకటి చేయకపోతే కొద్దిరోజుల్లో ఎలుక జాతి అంతరించిపోయే ప్రమాదముందని శంకించాడు. గజరాజుల బారి నుండి తమ జాతిని ఎలాగైనా రక్షించుకోవాలని నిర్ణయించుకున్నాడు. అందుకు తగిన సమయం కోసం ఎదురుచూడసాగాడు.



ఓ రోజు ఎప్పట్లాగే సాయంత్రంవేళ ఏనుగుల గుంపు చెరువు దగ్గరకొచ్చింది. చెరువులో నీళ్లు తాగాక, తొండంతో నీళ్లను చిమ్ముతూ సరదాగా ఆటలాడాయి. కాసేపటికి అవన్నీ వెనక్కి వెళ్లిపోతున్నాయి. ఏనుగుల రాజు వాటి వెనుక నడుస్తున్నాడు. అప్పుడు చిట్టెలుకల రాజు బొరియలో నుండి బయటికొచ్చింది.

"మహాప్రభూ.... ఈ చిన్నవాడి మాట ఆలకించండి" అని ప్రార్థించింది.

గజరాజుకు ఆ మాటలు ఎక్కడినుండి వచ్చాయో అర్థంకాలేదు. అయోమయంగా చుట్టూ చూశాడు. చివరకు కాళ్ల దగ్గర్లో చేతులు జోడించి నిలబడిన ఎలుక కనిపించింది.

"ఏంటో చెప్పండి" ఠీవిగా అన్నాడు గజరాజు.

"మీరు, మీ బంధు మిత్రులు చెరువు దగ్గరకొచ్చే సమయంలో చేస్తున్న హడావుడి అంతాఇంతా కాదు. దానివల్ల మీకేమైనా లాభముందోలేదో మాకు తెలీదు. కానీ మీ వల్ల మా జాతి అంతరించేలాగుంది. దయచేసి మా జాతిని రక్షించండి" అంటూ కన్నీళ్లతో వేడుకున్నాడు మూషిక రాజు.

"అయ్యయ్యో.... అలా అంటారేంటి? మావల్ల మీకూ, మీ జాతికి వచ్చిన కష్టమేంటో చెప్పండి" ఆదుర్దాగా అన్నాడు గజరాజు.

"మీ బంధుగణం కాళ్ల కిందపడి మా మూషికజాతి అంతరించిపోయేలాగుంది. మీరు చెరువు దగ్గరకొచ్చేటప్పుడు చిన్నపాటి సంకేతమిచ్చినా మేం జాగ్రత్తపడతాం. దానికితోడు మీరు వచ్చేదారిలో వున్న చెట్లన్నింటినీ కూలదోసుకుంటూ వస్తున్నారు. దీనివల్ల చెట్ల మీద వుండే పక్షులు, కింద వుండే మేమూ ఇబ్బందులపాలవుతున్నాం.



కాబట్టి మీరు ఇకనైనా అప్రమత్తంగా వ్యవహరించాలని కోరుకుంటున్నాను" అన్నాడు మూషిక రాజు.

"మా వాళ్ల అత్యుత్సాహంవల్ల మీరిన్ని ఇబ్బందులు పడ్తున్నారని నిజంగా మాకు తెలీదు. ఇకనుండి మేం కూడా జాగ్రత్తగానే మసలుకుంటాం. మరే ప్రాణికీ మా వల్ల హాని కలగదని భరోసా ఇస్తున్నాను" తొండాన్ని ప్రమాణం చేస్తున్నట్లుగా ముందుకు చాస్తూ అన్నాడు గజరాజు.

"చాలా సంతోషం. మీ మేలు ఎన్నటికీ మరువలేను. మీరు చేసిన సాయానికి మా చేతనైన సాయం చేసి, మీ ఋణం తీర్చుకుంటాను" కృతజ్ఞతతో అన్నాడు మూషిక రాజు.

ఆ మాటలకు గజరాజు పకపకా నవ్వాడు. "ఏంటేంటి? మా పాదమంత పెద్దగా కూడా లేని మీరు మాకు సహాయం చేస్తారా? చాలా విచిత్రంగా ఉంది" అని మళ్లీ బిగ్గరగా నవ్వాడు గజరాజు.



"సాయానికి చిన్నాపెద్దా భేదం లేదు గజరాజా! ఈ ప్రపంచంలో ఎవరి అవసరం ఎవరికీ అక్కర్లేని వాళ్లంటూ ఎవరూ ఉండరు. ఎంతటి గొప్పవారికైనా ఎప్పుడో ఒకప్పుడు చిన్నవాళ్ల అవసరం తప్పక ఉంటుంది. అలాగే మీకూ ఏదైనా అవసరంరావచ్చు. మరి నేను వెళ్లొస్తాను" అంటూ మళ్లీ వినయంగా నమస్కరించాడు మూషిక రాజు. గజరాజు కూడ ప్రతి నమస్కారం చేసి, ముందుకు కదిలాడు.

కాస్త ముందుకు వెళ్లేసరికి ఏనుగుల ఘీంకారం వినిపించింది. ఆ అరుపు విని ఏదో పెనుముప్పు ముంచు కొచ్చిందని గ్రహించాడు గజరాజు. ఆఘమేఘాల పరుగెత్తుకుంటూ అరుపులు వినిపించినవైపు వెళ్లాడు. అక్కడ వేటగాళ్లు పన్నిన వలలో చిక్కుకొని కనిపించాయి కొన్ని ఏనుగులు. ఆ వలలు చాలా బలంగా ఉన్నాయి. వాటి నుండి ఏనుగుల్ని ఎలా విడిపించాలో గజరాజుకు అర్థంకాలేదు. అప్పుడే ఓ చిట్టెలుక అటువైపు వచ్చింది. అది అంతకుముందే మూషికరాజుకు గజరాజు ఇచ్చిన 'హామీ' గురించి వింది. అది పరుగుపరుగున వెళ్లి మూషికరాజుకు ఇక్కడి సంగతంతా వివరించింది. మూషికరాజు ఆజ్ఞానుసారం క్షణాల్లో వేలాది చిట్టెలుకల దండు బయల్దేరింది. అవన్నీ ఏనుగులు చిక్కుకున్న ప్రదేశానికొచ్చి, తమ పదునైన పళ్లతో వలలను తెంచడానికి ప్రయత్నిస్తున్నాయి. అలా తెల్లవారేంతవరకు అవి పనిచేస్తూనే ఉన్నాయి. ఎట్టకేలకు వలలన్నీ తెగిపోయాయి. ఏనుగులన్నింటికీ బంధాల నుండి విముక్తి లభించింది.

"నన్ను క్షమించండి మూషిక రాజా! మీ ఆకారాన్ని చూసి మిమ్మల్ని తక్కువగా అంచనావేశాను. మీరన్నమాటలే నిజం. ప్రపంచంలో ఏ ఒక్కరి వసరంలేకుండా ఎవరూ మనలేరు. అజ్ఞానంతో నేను అన్న మాటల్ని మనసులో పెట్టుకోకండి" అంటూ క్షమాపణలు కోరాడు గజరాజు.

"అయ్యో.... మనందరం ఒకచోట వుంటున్న వాళ్లం. మనలో ఎవరికైనా ఆపద వస్తే అందరం కలిసి దాన్ని ఎదుర్కోవాలి. ఇప్పుడు మేం చేసింది కూడా అదే" అంటూ మూషిక గణంతో వెనుదిరిగాడు మూషిక రాజు.

# దేశ భక్తి

- శివాజీ



"బాగా చదువుకుని పెద్దయ్యాక నువ్వు జిల్లా కలెక్టర్‌వి కావాలి" అంది. తల్లి తన కొడుకుని "అలాగే" అన్నాడు ఆ అబ్బాయి. ఆమె ఎప్పుడూ ఆ అబ్బాయికి భారతీయ సంస్కృతి గురించి బోధించేది. భారతదేశంపై విదేశీయులు చేసిన దండయాత్రలు, వారు నాశనం చేసిన సంపదల గురించి చెబుతుండేది. తల్లి చెప్పిన విషయాలు శ్రద్ధగా విన్న ఆ బాలుడు స్కూలు కెళ్లిన పిదప ఆమె చెప్పిన అనేక విషయాలను తిరిగి స్నేహితులకు వివరించేవాడు. వారిని విదేశీ దుస్తుల్లో కాకుండా సంప్రదాయ దుస్తుల్లో స్కూలుకు రమ్మనేవాడు. పిల్లలందరూ పంచెలు కట్టుకుని స్కూలుకు రావడం ఉపాధ్యాయులకూ, పెద్దలకూ ఆశ్చర్యం కలిగించింది. అతనిలోని నాయకత్వ లక్షణాలు చూసి అందరూ విస్తుపోయేవారు. తన మాటలతో తోటి విద్యార్థులను అతడు ప్రభావితం చేసేవాడు.

ఇది గిట్టని ఆంగ్ల ఉపాధ్యాయులు అతణ్ణి అనుమానించి హింసించారు. అది భరించలేక ఉపాధ్యాయుల్ని రోడ్డు మీదే దేహశుద్ధి చేశాడతడు. ఫలితంగా అతణ్ణి కాలేజీ నుంచి పంపించి వేశారు. మరో కాలేజీలో చేరి చదువు పూర్తి చేశాడు. తల్లికోరిక ప్రకారం ఇంగ్లాండ్ వెళ్లి ఐ.సి.ఎస్. పరీక్ష పాసై భారతదేశం తిరిగి వచ్చాడు. స్వదేశంలో ఆంగ్లేయుల అరాచకాలను విని చలించిపోయాడు. తను కలెక్టర్‌గా ఉద్యోగంలో చేరితే దొరల బానిసగా పని చేస్తూ తోటి వారిని హింసించాల్సి వస్తుందని అందుకు నిరాకరించాడు. ఒక భారతీయుడు ఐ.సి.ఎస్. పాసవడం ఆ రోజుల్లో అరుదైన విషయం. కానీ అతను తన జీవితాన్ని దేశానికే అంకితం చేయాలని నిశ్చయించుకున్నాడు. అతడు దేశభక్తులతో కలిసి అనేక ఉద్యమాలు నడిపాడు.

అతని సమయస్ఫూర్తి, వాక్చతురత, నాయకత్వ లక్షణాలు, ప్రణాళికలు ప్రజలకు బాగా నచ్చాయి. బ్రిటీష్ ప్రభుత్వం కోపగించి అతనిపై అర్థంలేని నేరాలను మోపింది. ప్రతిక్షణం నీడలా వెంటాడి అతని పనికి ఆటంకాలు కల్పించింది. అతను భారతదేశం విడిచిపోయి బయటే సైన్యాన్ని సమీకరించి దండెత్తాలని నిర్ణయించుకుని దేశం నుండి బయటపడ్డాడు. అతడు స్థాపించిన అజాద్‌హింద్‌ఫౌజ్ అనే సైనిక దళంలో స్త్రీ పురుష భేదం లేకుండా ఎందరో చేరారు. భారతదేశం కోసం తమ చివరి రక్తం బొట్టువరకూ ధారపోస్తామని ప్రమాణం చేశారు. అధునాతన యుద్ధ పరికరాలతో వున్న బ్రిటీష్ ప్రభుత్వంపై దండెత్తేందుకు వ్యూహం పన్నిన ఆ దేశ భక్తుడు విమాన ప్రమాదంలో కనుమరుగైనాడు. మాతృదేశం కోసం తన ప్రాణాన్ని ఫణంగా పెట్టిన ఆయన ఎవరో కాదు. నేతాజీ సుభాష్‌చంద్రబోస్.

## పాటలు పాడే దిండ్లు



పాటలు లేదా ఏదైనా వాద్య సంగీతాన్ని వింటూ నిద్ర పోయేందుకు చాలా మంది ఇష్ట పడుతుంటారు. అందులో కొంత మంది పక్క వారికి ఇబ్బంది లేకుండా వాక్‌మన్‌లను చెవులకు తగిలించుకొని తమకిష్టమైన సంగీతాన్ని వింటూ నిద్రలోకి జారుకుంటారు. ఇటువంటి వారి వల్ల పక్కవారికి ఇబ్బంది లేకపోయినా వాక్‌మన్‌ల వల్ల వారికి చాలా అసౌకర్యంగా వుంటుంది. ఇలాంటి వారికోసం ఇప్పుడు పాటలు పాడే దిండ్లు వస్తున్నాయి. దిండ్లు పాటలు పాడడమేమిటని విచిత్రంగా అన్పించినా ఇది నిజం. దిండ్లలో తక్కువ సౌండ్‌తో మనకు మాత్రమే పాటలు విన్పించే ఆధునాతన స్పీకర్లను అమర్చి విక్రయానికి మార్కెట్‌లోకి విడుదల చేస్తున్నారు.

## మనమంతా ఒక్కటే!

ఎల్లలు లేనిది మనసు
ఎల్లరి కున్నది మనసు

మనసును నిలపగ మమత
మనలో పెరుగును సమత

మమతను నీలో నిలుపు
సమతకు అదియే మలుపు

నింగిని సూర్యుడు ఒక్కడు
నిశిలో చంద్రుడు ఒక్కడు

గాలికి గుణమూ ఒక్కటి
నీళ్లకు గుణమూ ఒక్కటి

నీకూ కావాలి నీరు
నాకూ కావాలి నీరు

నీకూ కావాలి గాలి
నాకూ కావాలి గాలి

నీరు, గాలి మన ప్రాణం
నింగి నేల మన ప్రాణం

గాలికి లేదూ భేదం
నీళ్లకు లేదూ భేదం

నీలో నాలో చూడగ ఎందుకు భేదం
నీకూ నాకూ ఎప్పుడు ఎందుకు భేదం

భారత దేశం ఒక్కటి
భారతీయులం ఒక్కటి

మనం మనం భాయి భాయి
అనుకుంటే హాయి హాయి

చేయి చేయి కలుపుదాం!
హాయిగాను బతుకుదాం!!

- రెడ్డి రాఘవయ్య



**పుస్తక పరిచయం**

# కొత్త ఆలోచనలకు ప్రేరణ

**హాయ్ ఫ్రెండ్స్!**

గుర్రపు స్వారీ, సైకిల్ త్రొక్కడం, స్కూటర్, మోటార్ సైకిళ్ళను నడపడం, కాస్త పెద్దయితే కారు, బస్సు, రైళ్ళు, స్టీమర్లు, విమానాలు నడపడం, ఇంకా ఆలోచిస్తే రాకెట్‌లు, సెటిలైట్‌లలో ప్రయాణించడం వీటిలో కొన్ని మనం చేయగలం. మరికొన్ని మనకు తెలిసిన వారు నడపడం చూస్తుంటాం. మన పెద్దవాళ్ళను చూసి మనం కూడా ఇవన్నీ నేర్చుకుంటాం. మరి మన పెద్దవాళ్ళు ఇవి ఎలా నేర్చుకున్నారు? వాళ్ళ పెద్దవాళ్ళను చూసి కదూ! ఇలా ప్రశ్నించుకుంటూ వెళితే చివరికి మనం ఎక్కడికి వెళతాం. అసలు మొదట వీటిని ఎవరు నేర్చుకున్నారు? ఎలా నేర్చుకున్నారు? వంటి ప్రశ్నల దగ్గరకు వెళ్ళి ఆగుతాం. అప్పుడు ఇంకా ఆసక్తి పెరుగుతుంది కదూ! ఆ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకుంటే ఎంత బావుంటుందో! అంతేకాదు, ఆ సమాధానాలతో పాటు మనకు ఎన్నో ఇతర విషయాలు తెలుస్తాయి. మనకు కూడా ఎన్నో కొత్త ఆలోచనలు రావడానికి అవకాశం ఉంటుంది. ఇవన్నీ ఎందుకు చెబుతున్నానో అని సందేహం వచ్చిందా? నిజమే! వస్తుంది మరి! ఇంక పొడిగించనులే. అసలు విషయం చెప్పేస్తాను. నేను 'నడిచేటి నావ కథ' అనే పుస్తకం చదివాను. ఆ పుస్తకం చదువుతున్నప్పుడు నాకు ఇప్పుడు మీకు పైన చెప్పిన ఆలోచనలన్నీ వచ్చాయన్నమాట. ఆ పుస్తకంలో నావ గురించి ఉంది. నావ అంటే తెలుసు కదా! కొన్ని చోట్ల నావను పడవ అంటారు. మరికొన్ని చోట్ల లాంచీ, ఇంగ్లీషులో పెద్దవాటిని స్టీమరు అని కూడా అంటారు కదా! నీటిలో మనం చిన్న రాయి వేస్తే మునిగిపోతుంది కదా! మరి అంత పెద్ద పెద్ద పడవలు ఎలా నడిపిస్తున్నారు. అసలు నీటిలో పడవ నడప వచ్చు అనే ఆలోచన ఎలా వచ్చింది? మీకు తెలుసు కదా! మన పూర్వ కాలంలో ప్రపంచంలో ఎక్కువగా పడవ ప్రయాణాలే ఉండేవి. ఒక దేశం నుండి మరో దేశానికి వెళ్ళాలంటే ఎక్కువగా పడవ ప్రయాణాలు చేసేవారు. ఆయా దేశాలకు సరుకులను పడవలలోనే తీసుకువెళ్ళేవారు. మన భారత దేశాన్ని కనుక్కున్న పోర్చుగల్ నావికుడు వాస్కోడిగామా, అమెరికాను కనుగొన్న కొలంబస్ లు సముద్రంలో పడవ ద్వారా ప్రయాణించే వచ్చారని మనకు తెలుసు కదా! మరి ఇంత ప్రాధాన్యత ఉన్న పడవ ప్రయాణం గురించి, పడవ ఆలోచన మొదట ఎలా వచ్చిందో? దానికి మూలం ఏమిటో! అటువంటి విషయాల గురించి మీరు తెలుసుకోవాలంటే 'నడిచేటి నావ కథ' పుస్తకం చదవాల్సిందే. చదివిన తర్వాత మీకూ కొత్త ఆలోచనలు ఎలా చెయ్యొచ్చో, దానివల్ల సమాజానికి ఎంత ఉపయోగం జరుగుతుందో గ్రహిస్తారు, తెలుసా?. డా॥ ఎస్. పి. ఖత్రా రాసిన పుస్తకం ప్రజాశక్తి బుక్‌హౌజ్‌లో కొనుక్కోవచ్చు. పుస్తకం ధర 20/-.




**- వీరప్రసాద్**



# వెండి నగలు

- రమ

శ్రీరంగపట్నంలో సుబ్బయ్యశెట్టి అనే వడ్డీ వ్యాపారి ఉండేవాడు. నమ్మిన వాళ్లను మోసం చేసి బాగానే సంపాదించాడు. వడ్డీ వ్యాపారం పేరుతో నిరక్షరాస్యులతో ప్రామిసరీ నోటు మీద సంతకాలు చేయించుకొని, వాళ్లు అప్పు తీసుకున్న దానికంటే ఎక్కువ మొత్తం అందులో రాసేవాడు. ఇక ఆ అప్పుకు వడ్డీ, చక్రవడ్డీ కలిపి వాళ్ల ఆస్తికే ఎసరు పెట్టేవాడు. అలా చాలా లక్షలు కూడబెట్టాడు. ఇన్ని పాపిష్టి పనులు చేసిన సంపాదించిన డబ్బును దొంగల బారినుండి కాపాడుకోడానికి నానాతంటాలు పడ్తుంటాడు. అలాగని ఎవరికైనా దానధర్మాలు చేస్తాడా? అంటే అదీలేదు.

సుబ్బయ్యశెట్టి ఎంగిలి చేత్తో కాకిని తోలడు. పిల్లికి కూడా బిక్ష పెట్టడు. అంత పిసినారి. వంటకు కావాల్సిన ఉప్పు, పప్పులు కూడా చౌకధరల దుకాణంలోలా కొలిచి ఇస్తుంటాడు. ఈయనగారి పీనాసితనం భరించలేక భార్య ఏనాడో పుట్టింటికెళ్లిపోయింది. అలాంటివాడు ఇక బంధుమిత్రుల్ని చేరదీస్తాడా? చస్తే ఎవర్నీ తన ఇంటి గడప తొక్కనివ్వడు. ఎవరైనా వచ్చినా



వాకిట్లో నుండే బయటకు పంపిస్తాడు. ఇప్పుడు సుబ్బయ్యశెట్టి ఏకాకి. కానీ ఆర్జన మీద ఆసక్తి తగ్గలేదు. ఇప్పటికీ అతనిలో మార్పు రాలేదు.

ఓ రోజు రామయ్యకిచ్చిన అప్పుకు వడ్డీ వసూలు చేసుకునే పని మీద పొద్దున్నే ఊళ్లోకి బయల్దేరాడు సుబ్బయ్యశెట్టి. నేరుగా రామయ్య ఇంటికెళ్లాడు. ఆ సమయంలో రామయ్య ఇంట్లోలేడు. పొలానికెళ్లాడు. ఆయన భార్య సీతమ్మ, కొడుకు సుందర్ ఇంటి దగ్గరున్నారు.

"ఏమ్మా... రామయ్య లేడూ?" సీతమ్మను అడిగాడు సుబ్బయ్యశెట్టి.



''పొలమెళ్లాడండీ'' ముక్తసరిగా జవాబుచ్చింది సీతమ్మ.

"నా దగ్గర తీసుకున్న బాకీ తాలూకూ వడ్డీ ఇంకా ఇవ్వనేలేదు. నేనోసారి వచ్చి వెళ్లానని చెప్పు" చెప్పాడు సుబ్బయ్యశెట్టి.

"దేవుడి దయ వల్ల ఈసారి ధాన్యం బాగానే పండింది బాబూ. నూర్పుడి అయ్యాక ఆ పంట అమ్మేసి, అప్పు మొత్తం తీర్చెయ్యాలనుకుంటున్నాం. అందుకే కాస్త ఆలస్యమయ్యింది. సాయంత్రం ఆయన్ని పంపిస్తాలెండి" చెప్పింది సీతమ్మ.

"అట్టానా?! అట్టాగైతే ఇద్దరికీ మంచిదే. వడ్డీ గొడవ రామయ్యకుండదు. ఇంటి చుట్టూ తిరిగే బాధ నాకూ ఉండదు. సాయంత్రం రమ్మను. లెక్కలన్నీ చూసి పెడ్తాను'' పైకి మామూలుగానే అన్నా సుబ్బయ్యశెట్టి మనసు భగభగమండుతోంది.

'అప్పు మొత్తం తీరుస్తాడా? ఏం పెట్టి తీరుస్తాడు? తీసుకున్న అప్పుకు వడ్డీ, చక్రవడ్డీ మొత్తం కలిపి మీ ఆస్తికే ఎసరు పెట్టకపోతే నేను సుబ్బయ్యశెట్టినెలాగవుతాను?' ఉక్రోషంగా అనుకుంటూ అక్కడినుండి బయల్దేరాడు సుబ్బయ్యశెట్టి.

. . .

సాయంత్రం పొలం నుండి రాగానే సుబ్బయ్యశెట్టి దగ్గరకెళ్లాడు రామయ్య. బాకీ మొత్తం ఎంత అయ్యిందో లెక్కచూసి, చెప్పమన్నాడు. సుబ్బయ్యశెట్టి అప్పటికే కాగితాలన్నీ సిద్ధంచేసి పెట్టాడు. అంతా కలిపి యాభై వేల దాకా లెక్కతేలింది. అది విని రామయ్య ఖిన్నుడయ్యాడు.

వెంటనే తేరుకుంటూ, "అదేంటండీ శెట్టిగారూ.... ఏ నెలకానెల కూరగాయలు అమ్మగా వచ్చిన డబ్బుల్తో వడ్డీ కడ్తూనే ఉన్నానుగా. ఇంకా ఇంత అప్పు ఎలా ఉంటుంది? అసలు నేను తీసుకున్నది పదివేలు అయితే యాభైవేలు ఎలా అవుతుంది?" అని అడిగాడు రామయ్య.

''అంటే నేను అబద్ధమాడుతున్నానా? లేకపోతే దొంగ లెక్కలు రాశానా? ఇన్నాళ్ల నుండి ఈ ఊళ్లో వడ్డీ వ్యాపారం చేస్తున్నా. ఇంతవరకు ఎవరూ నన్నింత మాట అనలేదు. నా మాట మీద



నమ్మకం లేకపోతే నువ్వే చూడు" అంటూ ప్రామిసరీ నోటు అతని చేతికిచ్చాడు సుబ్బయ్యశెట్టి.

"నాకే చదువొస్తే మీరు వెయ్యమన్న చేపల్లా వేలిముద్ర ఎందుకు వేస్తాను? ఇవాళ ఇలా ఎందుకు మోసపోతాను?" కోపంగా అన్నాడు రామయ్య.

"ఏమయ్యోవ్.... మాటలు చాలా తేడాగా ఉన్నాయే? అంతేలే.... డబ్బు అవసరమైనప్పుడు ఇంటి చుట్టూ తిరుగుతారు. తిరిగి కట్టాల్సొచ్చేటప్పటికి ఇలా మాట్లాడతారు. అంత నమ్మకంలేనోడివి అప్పు కోసం నా దగ్గర కెందు కొచ్చావు?" కోపంతో రంకెలేశాడు సుబ్బయ్యశెట్టి.



"అసలేం జరిగిందో ఆ భగవంతుడికే తెలుసు. ఆయనే అన్నీ చూస్తున్నాడు. తప్పు ఎవరో చేశారో, శిక్ష ఎవరికి విధించాలో ఆయనకే తెలుసు. వచ్చే వారంలో నీ బాకీ మొత్తం అణాపైసలతో సహా చెల్లేస్తాను" అంటూ అక్కడి నుండి కదిలాడు రామయ్య. ఇంటికొచ్చిన తర్వాత శెట్టితో జరిగిన సంభాషణ అంతా భార్యకు చెప్పాడు.

"నాకు చదువు లేకపోబట్టే ఇవాళ ఇలా మోసపోయాను. నాకు పట్టిన గతి మీకు పట్టకూడదనే నా శక్తికి మించిన పనైనా మిమ్మల్ని చదివిస్తున్నాను. మీరు శ్రద్ధగా చదువుకోండి. నాలా మోసపోకండి" పిల్లల్ని దగ్గరకు తీసుకుంటూ గద్గద స్వరంతో అన్నాడు రామయ్య. ఎప్పుడూ ధైర్యంగా వుండే తండ్రి అలా డీలాపడిపోవడం ఎన్నడూ చూడలేదు సుందర్. తన తండ్రిని మోసం చేసిన సుబ్బయ్యశెట్టికి తగినశాస్తి చేయాలనుకున్నాడు. కానీ ఆ చిట్టి బుర్రకు ప్రతీకారం ఎలా తీర్చుకోవాలో తెలియలేదు. అలాగని ఆ విషయాన్ని మర్చిపోనూలేదు.

. . .

రెండు, మూడు నెలలు గడిచాయి. రామయ్య సుబ్బయ్యశెట్టి బాకీ మొత్తం తీర్చేశాడు. బాకీ తీరేనాటికి ఆ ఏడు పండిన పంట, సీతమ్మ దగ్గర మిగిలిన నగలు మాయమయ్యాయి. ఈలోగా పిల్లల పరీక్షలు కూడా పూర్తయ్యాయి. వేసవి సెలవుల్లో పట్నంలో వున్న అత్తయ్యగారింటికి వెళ్లారు సుందర్, అతని తమ్ముడు శ్యామ్.

అక్కడ వాళ్లకు శ్రీనివాస్ సైన్స్ మాష్టారు పరిచయమయ్యారు. ఆయన చాలా మంచివాడు. రోజూ సాయంత్రం పిల్లలందర్నీ చుట్టూ కూర్చోబెట్టుకొని రకరకాల విషయాలు చెప్పేవాడు. సుందర్‌కి అతనితో బాగా చనువు పెరిగింది. ఓసారి మాటల మధ్యలో సుబ్బయ్యశెట్టి గురించి, అతను తమకు చేసిన అన్యాయం గురించీ చెప్పాడు సుందర్.

"సుబ్బయ్యశెట్టి చాలా చెడ్డవాడు మాష్టారు. మాలాగే ఎంతోమందిని మోసం చేశాడు. అలాంటివాడికి బాగా బుద్ధిచెప్పాలి. మా అమ్మ నగలు మళ్లీ ఆమెకే దక్కేలా చెయ్యాలి" ఆవేశంగా అన్నాడు సుందర్.



"నువ్వు ఆవేశపడకు. అతనికి బుద్ధిచెప్పడానికి నా దగ్గర ఒక ఉపాయం ఉంది. వచ్చే వారం నేను మీ ఊరికొస్తాను. అక్కడ నేను చేయాల్సిన పని ఒకటి ఉంది" అన్నాడు శ్రీనివాస్.

అన్నట్టుగానే వారం రోజుల తర్వాత శ్రీనివాస్ శ్రీరంగపట్నం వెళ్లాడు. సుందర్ వాళ్లింటికెళ్లకుండా చిన్న సత్రంలో బస చేశాడు. సుందర్ కనిపించినా అతనెవరో తెలియనట్లే ప్రవర్తించాడు. రెండు రోజులున్న తర్వాత ఓ సాయంత్రం సుబ్బయ్యశెట్టి ఇంటికెళ్లాడు.

తన చేతిలో వున్న నగల మూట అతని ముందు పెట్టి, "శెట్టిగారూ.... మీ గురించి ఈ ఊళ్లో చాలామంది చెప్పారు. మీరెంతో మంచివారనీ, ఆపదలో వున్న వారికి చేతనైన సాయం చేస్తారని విన్నాను. అందుకే మిమ్మల్నే నమ్ముకొని మీ దగ్గరకొచ్చాను. మీరు నాకు సాయం చేయగలరా? మీ ఋణమేమీ ఉంచుకోను" నమ్మకంగా అన్నాడు శ్రీనివాస్.



"చూడబోతే వేరే ఊరువాడిలా ఉన్నావు. నేను నీకెలా సాయపడగలను?" అడిగాడు సుబ్బయ్యశెట్టి.

"మా బామ్మకు బాగా జబ్బుగా ఉంది. ఆమెకు వైద్యం చేయించడానికి నా చేతిలో చిల్లిగవ్వలేదు. ఒకప్పుడు మాది బాగా బతికిన కుటుంబం. కానీ ఇప్పుడు ఆస్తి అంతా హారతిలా కరిగిపోయింది. మా బామ్మ పెళ్లికి చేయించిన ఈ వెండి నగలు మాత్రం మిగిలాయి. వాటిని అమ్ముదామంటే మనసురావట్లేదు. అందుకే వీటిని తాకట్టు పెట్టుకొని, కొంత డబ్బు ఇప్పిస్తే...." అంటూ అర్థోక్తిలో ఆపేశాడు శ్రీనివాస్.

సుబ్బయ్యశెట్టికి విషయం అర్థమైంది. శ్రీనివాస్ తెచ్చిన నగల మూట విప్పిచూశాడు. సుమారు ఏడెనిమిది కిలోల వెండి నగలు, సామాను ఉన్నాయందులో. 'అమ్మితే ఓ అరవై వేలకు పైనే రావచ్చు' అనుకున్నాడు మనసులో.

"పాత నగలైనా కొత్త వాటిలా మెరిసిపోతున్నాయి. కానీ ఇప్పుడు వెండి ధర ఏమంత బాగాలేదయ్యా? నీకు మొత్తం మీద ఓ నలభై వేలు ఇవ్వగలనంతే" అన్నాడు సుబ్బయ్యశెట్టి.

"పాతవంటే ఎవరూ తాకట్టు పెట్టుకోరని ఈ మధ్యనే మెరుగుపెట్టిచ్చానండీ. నలభై వేలిస్తే ఇప్పటికి అవసరం గట్టెక్కుతుంది. రెండు, మూడునెలల్లో వీలుచూసుకొని వస్తాను. నూటికి పది రూపాయల చొప్పున వడ్డీ చెల్లించి మరీ మా నగలు తీసుకెళ్తాను" నమ్మకంగా అన్నాడు శ్రీనివాస్. నూటికి పది రూపాయలు వడ్డీ అనేసరికి సుబ్బయ్యశెట్టి ఎగిరిగంతేశాడు. అప్పటికప్పుడు నగల మూట తీసుకొని, నలభై వేలిచ్చి పంపాడు.

ఆ డబ్బు తీసుకొని శ్రీనివాస్ నేరుగా రామయ్య ఇంటికొచ్చాడు. సుబ్బయ్యశెట్టి దగ్గర తీసుకున్న డబ్బు రామయ్య చేతిలో పెడ్తూ, "ఈ డబ్బు మీది.





మిమ్మల్ని మోసం చేసి సుబ్బయ్యశెట్టి కాజేసిన సొమ్ము ఇది. ఇకమీదట ఎవరి దగ్గరైనా అప్పు చేసేటప్పుడు జాగ్రత్తగా ఉండండి" అని చెప్పాడు.

రామయ్య అతనివైపు అయోమయంగా చూశాడు. దాన్ని అర్థం చేసుకున్న శ్రీనివాస్, "మీరేం కంగారుపడకండి. సుబ్బయ్యశెట్టికి ఇచ్చినవి నిజంగా వెండి నగలు కావు. అవి రాగి నగలు. చిన్న ప్రయోగం ద్వారా వాటిని వెండి నగలుగా మార్చాను. ఒక్క మాటలో చెప్పాలంటే మోసాన్ని మోసంతోనే జయించాను" అన్నాడు.

"రాగి వెండిగా మారడమేంటి? నాకంతా అయోమయంగా ఉంది" అన్నాడు రామయ్య. సుందర్ కూడా అదే మాట అన్నాడు.

దానికి శ్రీనివాస్ నవ్వి, "సుందర్! ఇదంతా సైన్స్ మ్యాజిక్. నువ్వు పాఠాల్లో హైపోద్రావణం అనే పేరు వినే ఉంటావు. ఆ ద్రావణంలో రాగి నగలు ముంచితే మూడు, నాలుగు నిముషాల్లోనే వెండి వాటిలా మారతాయి. రాగి హైపోద్రావణంతో జరిపే రసాయనిక చర్యే దీనికి కారణం" అంటూ వివరించాడు.

అంతలోనే ఏదో గుర్తొచ్చినవాడిలా, "కానీ విషయం మీరెక్కడా బయటపెట్టకండి. కొంపలు మునుగుతాయి. ఇంకో విషయం.... నేను మీకు తెలుసనే విషయం కూడా ఎవరికీ చెప్పవద్దు. అది మీకే ముప్పు. నేను ఇప్పుడే ఈ ఊరు వదిలివెళ్లిపోతున్నాను. ఇకమీదట ఇక్కడికి రావడం కూడా కుదరదు. మీ అత్తయ్యగారింటికి వచ్చినప్పుడు కలుద్దాం. బై...." త్వరత్వరగా చెప్పి, చీకట్లో కలిసిపోయాడు శ్రీనివాస్.

అతను వెళ్లిన వైపే కృతజ్ఞతగా చూస్తూ నిలబడిపోయారంతా. 

**సమాధానాలు : పదప్రహేళిక-5**

**అడ్డం :** 1. కృషీవలురు, 4. రమ 6. తన, 7. చమురు 10. కంఠస్వరము,

**నిలువు :** 1. కృతజ్ఞత, 2. వధువు, 3. రుధిరము, 5. మరువము 7. నరకం

Edited, Printed, Published & Owned by Dr. A. Prasad Rao, H.No. 1-9-312/3/G1, Vidyanagar, Hyderabad - 500 044, AP. Printed at Prajasakti Daily Printing Press, 1-1-60/2, RTC 'X' Roads, Hyderabad - 500 020, AP. Published at H.No. 1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500020, AP. **Editor: Dr. A. Prasad Rao**

# మామయ్య పత్రిక రచయితలకు సూచనలు

* ప్రతి రచనా మానవతా విలువలను పెంచేదిగా ఉండాలి.
* బాలలకు సులభంగా అర్థమయ్యేలా సరళమైన భాషను తమ రచనలో ఉపయోగించాలి.
* మూఢనమ్మకాలను ప్రోత్సహించేవిగా రచనలు ఉండరాదు. అలాగే హింసను ప్రేరేపించేవిగా ఉండరాదు.
* వినోదంతో పాటు విజ్ఞానాన్ని అందించే విధంగానూ,బాలల్లో సృజనాత్మకతకు దోహదం చేసే విధంగానూ రచనలు ఉండాలి.
* హాస్యం మేళవింపు రచనకు మరింత ప్రయోజన కరం
* కుల, మత, ప్రాంత సంకుచిత భావాలకు అతీతంగా రచనలు విశాల దృక్పథంతో కూడినవై ఉండాలి.
* బాలలకు ప్రయోజనం కలిగించేవి, సబోధకంగా ఉన్నవి, అన్ని రకాల ప్రక్రియల్లో ఉన్న రచనలు పరిశీలించబడును
* చక్కటి అంశాలతో, వినూతనంగా ఉన్న రచనలకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడును.
* అవసరమైన స్వల్ప మార్పులు చేసే అవకాశం ఉంది.
* పంపే రచన తమదేనని, ఇంతకు ముందు ప్రచురింపబడలేదని, ఇతర ఏ పత్రికకూ ప్రచురణ కొరకు పంపలేదని ధృవీకరణ పత్రం రచనతో పాటు విధిగా పంపాలి.
* రచనల ఎంపికకు బాలల ప్రయోజనమే ప్రాతిపదిక. ప్రచురణకు అంగీకరించిన తరువాత సమయం పట్టవచ్చు.
* ప్రచురించడానికి స్వీకరించని రచనలు తిప్పి పంపబడవు. ఒకవేళ తిప్పి పంపాలని కోరుకుంటే, తగిన స్టాంపులు అంటించి, చిరునామా రాసిన కవరును జతపరచవలెను.
* పాటలు/గేయాలు నేరుగా బాలలు పాడుకునే విధంగా ఉండాలి.
* నేరుగా బాలలకు ఉద్దేశించిన రచన బొమ్మతో సహా ప్రింటులో ఒకపేజీ ఉంటే మంచిది.రెండు పేజీలకు మించరాదు. చెప్పదలచుకున్నది నేరుగా,సూటిగా ఉండాలి.
* బాలల మంచి చెడ్డల విషయంలో వారి తల్లితండ్రులకు, ఇతర పెద్దలకు ఉద్ధేశించిన రచనలు కూడా పంపవచ్చును.
* స్వయంగా బాలలు చేసిన రచనలకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఇందుకు వారిని ప్రోత్సహించి పంపించాలి.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A107 |
| పుస్తకం పేరు | మామయ్య |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |